# ★ పాత్రలు ★

## —: పురుషులు :—

| | |
|---|---|
| జహాంగీరు | మొగల్ పాదుషా |
| షేర్ ఖాన్ | మెహెర్ భర్త |
| ఖుస్రూ | జహాంగీరు పెద్దకొడుకు |
| షాజహాన్ | ,, రెండో ,, |
| షహర్యార్ | ,, మూడో ,, |
| మహాబత్ | మొగల్ సేనాధిపతి |
| మీర్జా | ఖజాంచి, మెహెర్ తండ్రి |
| ఆసఫ్ | మీర్జా కొడుకు |
| సంగ్రామ్ | జహాంగీరు అంతరంగికుడు |
| వంది | భట్టు |
| మాగధుడు | భట్టు |
| శైలెసాబ్ | పఠాను బాటసారి |
| రణసింగ్ | రజపుత్ సర్దారు |

## —: స్త్రీలు :—

| | |
|---|---|
| మెహెర్ | నూర్జహాన్ |
| లైలా | మెహెర్ కొమార్తె |
| జోధపురి | జహాంగీరు పట్టమహిషి |
| మాలి | దాసి |

సామంతులు, దండనాథులు

నర్తకులు, గాయకులు మొదలగువారు

# అంకం ఒకటి

## రంగం ఒకటి

---

వందిమాగధులు ప్రశస్తి చదువుతుండగా తెర నెమ్మదిగా పైకి పోతూవుంటుంది రంగంమీద మీర్జాగయాష్, ఆసఫ్‌ఖాన్, సంగ్రాం, సామంతులు మొదలగువారు బాదుషాహ్ కోసం నిరీక్షిస్తూ కనబడుతారు — మోటికూడావుంది.

**వంది** — హింద్ కా అఖండ్ సమ్రాట్ ఆరహేహైఁ! హోషియార్!

**మాగ** — కర్తుం, అకర్తుం, అన్యథాకర్తుం, సర్వశక్తిమాన్‌కా ఆరహేహైఁ, హోషియార్.

**వంది** — తైమూర్‌లంగ్ రాజవంశ గగనాంకణ్‌పై [illegible] జ్యోతిపుంజ్ కా రాశీ ఆరహేహైఁ! హోషియార్!

**మాగ** — ఇరాన్, తురాణ్, ఇస్ఫహాన్, జైపూర్, జోధ్‌పూర్, జస్సల్‌మీర్ ఇత్యాది శతసహస్ర మండలాధీశ్వర్ కా అధీశ్వర్ ఆరహేహైఁ! హోషియార్!

**వంది** — బల్మేభీమ్, దాన్మేకర్ణ్, రూప్మేఅనంగ్, దుష్మనోంకేభుజంగ్, జంగ్ మైదాన్మేసింగ్, ఆరహేహైఁ! బజావో భేరీమృదంగ్, బజావ్!

తూర్యారవాలతో జహంగీరు ప్రవేశం. పరధ్యానంలో గాఢంగా నిమగ్నుడై ఉన్నట్లు జహంగీరు వైఖరి చెప్పక చెబుతున్నది. అతడు సింహాసనంమీద కూర్చున్న వెంటనే ఆసఫ్‌ఖాన్ ఈ దిగువ పద్యం చదువుతారు. పద్యభావానికి అనురూపంగా దాసీలు ఆయా కానుకలు తీసుకవస్తారు.

**ఆసఫ్** — సీ. శ్రీ శ్రీ యఖండకీర్తి క్రాంత కకుబంత!
కాంధహారంపిన కానుకలివిగో!
శిల్ప, గాన, కవిత్వ, చిత్రకళోద్ధార
కాశ్మీర పంపిన కప్పమిదిగో!
జయదుందుభిధ్వాన చకిత శాత్రవలోక
లంకయర్పించిన సుంకమదిగో!
ఆసేతుశీతనగాధ్యక్ష! ఇరాన్ తు
రానులంపిన నజరాన లవిగో!

హిందుముస్లిము సంధాన హితవిధాన !
చల్లనగు నీదుపాలన నుల్లసిల్లి
హైందవ ప్రజ 'జై' ! 'జై' ! జహాంగిరనుచు
కోటివాక్కుల నినదింపు ఘోషమడుగో !

(అంతా "జై" బాదుషాకు "జై" అంటారు)

మిర్జా—జహాఁపనా ! బిలాయతీసాబ్ తమదర్శనార్థం వేచియున్నారు.

జహాన్—బిలాయతీసాబ్ ? కౌన్ హై బిలాయితీసాబ్ ?

మిర్జా—ప్రపంచ పర్యటనంచేస్తూ ఈ హిందూదేశంవచ్చి తమదర్శనానికై ఎదురు చూస్తున్న ఫ్రాన్సుదేశ్ వాలా మన్సూర్ కెలై.

జహాన్—హాఁహాఁ కెలై సాబ్ ఫరాఁస్ ఖాన్ అచ్ఛా, ఆసఫ్ ! తుఁజావ్ ఉస్ ఫరాఁసీకో అంఁదర్ భేజో !

(ఆసఫ్ నిష్క్రమణము)

జహాన్—మిర్జా !

మిర్జా—జోహుకుం ఖుదావంఁద్ !

జహాన్—నీ అల్లుడు-మహావీరుడు-మన షేర్ ఖాన్-ఎట్లున్నాడు ? గాయాలు మానినవా ?

మిర్జా—ఇంకను పూర్తిగా మానలేదు.

జహాన్—పాపము ! బొత్తుగా లేవలేని స్థితిలో లేడుకదా. దర్బారుకు రాగలడా ?

మిర్జా—దేవర చిత్తము.

జహాన్—మాకు వినోదార్థం మేము కోరిన వెంటనే పెద్దపులితో ద్వంద్వయుద్ధం చేసి అఖండ విజయం పొందిన ఆతని అనన్య బలపరాక్రమాలకు ఆగ్రానగరమంతా హాహాకారం చేసింది. షేర్ ఖాను ఎన్నోవిధాల ధన్యజీవుడు సుమా.

మిర్జా—(ధ్వని అర్థమైనప్పటికీ చలించకుండా) కావచ్చును.

జహాన్—(రానినవ్వు తెచ్చుకుంటూ) ఔను మనషేర్ ఖాను అన్నివిధాలా ధన్యజీవుడే. అతణ్ణి ఈక్షణంలో మా సన్నిధికి రప్పించి, కౌగిలించి, ప్రశంసించి మా ఆనందాన్ని ఆమూలాగ్రంగా వెల్లడించవలెనన్న ఒక గాఢ కుతూహలం మాకు కలిగింది. — మిర్జా ! నీవుపోయి షేర్ ఖానును రమ్మని చెప్పెదవా ?

మిర్జా—ఆజ్ఞయా ?

జహాన్—మనషేర్ ఖానుకు ఆజ్ఞయా ! ఆజ్ఞకాదు. "ఆహ్వానము" అనిచెప్పు !

(మీర్జా అయిష్టంగా నిష్క్రమణం)

జహాన్—అంటే !

సంగ్రాం—అంటే ? షేర్‌ఖాన్ వద్ద ఒక అమూల్యమైన, అలోక సుందరమైన వస్తువు ఉంది. ఆవస్తువును తమయిచ్చ వచ్చిన ధరకట్టి అతడు మీకేమి విక్రయం చేయకూడదు.

జహాన్—మూర్ఖుడా ! షేర్‌ఖాన్ వంటి వీరుడు అట్టిపనికి ఒడంబడునా ?

సంగ్రాం—ఆశ అనేది ఒక్కొక్కప్పుడు ఏలాంటి పనైనా చేయిస్తుంది. షేర్‌ఖాను యువకుడు, ఆశాపరుడు, ఇప్పుడు చిన్న నౌకరీలో వున్నాడు. దేవరకృతజ్ఞతను, ఆర్జించుకుంటే అతడు మన్సబ్‌దారే కాదు, సుబేదారే కాదు, చివరకు మొంగలాయి సైన్యానికంతా నాయకీ బహద్దుర్ కావచ్చు.

జహాన్—సరే మంచిది. నీవుపాయంకూడా సమంజసంగానే వుంది. కాని-ఇప్పుడు కాదు. ఈ రెండోయత్నంకూడా నిష్ఫలం అయితే, నీ వుపాయాన్ని మూడోయత్నంగా నీవే వుపయోగించి చూతువుగాని.

సంగ్రాం—జోహుకుం ఖుదావంద్ !

వంది—జహాఁపనా ! కెలై దొరగారు తమయాజ్ఞకు నిరీక్షిస్తున్నారు.

జహాన్—లే ఆవ్ !

(వంది నిష్క్రమణం)

జహాన్—రాజా! ఈ కెలైను ఎందుకు పిలిపించానో నీకు తెలుసునా ? షేర్‌ఖాన్ వంటివీరులు భారతదేశంలో ఉన్నారని చూపించుటకే !

సంగ్రాం—ఔను ! దేవర ఉద్దేశాలు, దేవతా ఉద్దేశాలే !

(వందివెంట కెలై ప్రవేశం)

కెలై—Good Morning to Your Majesty!

జహాఁ—హా హా హా—జనాబ్ కెలై—ఆయియే—ఏకీ !

(మోతి చెరియొక మధుపాత్ర అందిస్తుంది.)

జహాఁ—(మధువు అనుతూ) కెలైసాబ్! మీరాజ్యంలోవున్న చిత్రకారుల సాటి యేరాజ్యంలోనూ లేరని, ఒకనాడుమీరు సగర్వంగా చెబుతూ, నిదర్శనంగా ఒక చిత్రపటం మాకు బహుమానం చేశారు జ్ఞాపకంవుందా ?

కెలై—yes ! yes !

జహాఁ—ఏదీ ! (మోతి ఒక దంతపుపెట్టె అందిస్తుంది దాన్ని తెరుస్తూ) మీరిచ్చిన ఆ చిత్రపటానికి నాచిత్రకారులచేత నాలుగు నకళ్లువ్రాయించాను చూడండి

కెలై—(చూచి ఆశ్చర్యపడతాడు)

జహాఁగ్—హా హా హా ఖడ్గమృగమా ! ఇంతేనా ! అనయినా పురాణగోష్టి

సంగ్రాం—జహాఁపనా ! ఖడ్గమృగంకంటె ఏనుగును చంపడం ఎక్కువకష్టం నేమండీ !

జహాఁగ్—ఎవరికి ?—మనషేర్‌ఖాన్‌వంటి వీరునకా ?

సంగ్రాం—కాదు హెర్క్యులిస్‌కి ! మన షేర్‌ఖానుకు ఈ మర్త్యలోకంలో వున్న ఏనుగే కాదు, ఇంద్రలోకంలో వున్న ఐరావతమైనా జోహారు చేయవలసిందే !

జహాఁగ్—షేర్‌ఖాన్ !

షేర్—జోహుకుంఖుదావంద్ !

జహాఁగ్—నీవు పెద్దపులితో పోరాడిన అద్భుత దృశ్యాన్ని ఈ కలైసాబ్‌కు చూపలేకపోతిని. ఇప్పుడు నిన్ను ఏనుగుతో పోరాడించి వీరికి ప్రత్యక్షంగా చూపించవలెనని మాకు గాఢమైన అభిలాషకలిగింది !

షేర్—దేవరయాజ్ఞ !

జహాఁగ్—ఆహా వీరలక్షణం ! సంగ్రాం ! పోయి ఒక ఏనుగును సిద్ధంచేయుము ?

సంగ్రాం—అవశ్యం జహాఁపనా ! (నిష్క్రమణం)

కలై—సమ్రాట్! గాయాలు యింకా మానలేదు. పాపం! వెంటనేమరల ఏనుగుతో పోరాడించుట న్యాయముకాదు.

మిర్జా—జహాఁపనా ! ఒక్కమనవి.

జహాఁగ్—క్యాహై ?

మిర్జా—పెద్దపులితో పోరాడి రెండు దినములైనాగడవలేదు, దాని పంజాగాయములు ఇంకా పచ్చిగనే వున్నవి ఇప్పుడు మరల ఏనుగుతో పోరాటం ! ఈ కుర్రవాని శ్రేయస్సు సమ్రాట్ కోరినయెడల ఈ పోరాటం ఈనాటికి ఆపించవలెనని నామనవి.

కలై—ఔను. నామనవికూడా అదే !

షేర్—జహాఁపనా ! పెద్దపులితో పోరాడి నేనెంత అలసియున్నా, మీకు ఆనందం సమకూర్చవలెననే ఉత్సాహం నాబడలికనంతయూ మరపించినది అజ్ఞ !

జహాఁగ్—బడీబాత్ హై ! బడీబాత్ హై ! తుంగ్‌లాయక్ యోధ్ధోఁసబ్ సే తుమ్ వీరాధివీర్ హో షేర్‌ఖాన్ !

సంగ్రాం—(ప్రవేశించి) జహాఁపనా ! ఏనుగు అదిగో సిద్ధంగా వుంది.

జహాఁగ్—షేర్‌ఖాన్ !

షేర్—(కత్తిదూసి) జయ్‌హో! జహాంగీర్ బాదుషాకీ జయ్‌హో (నిష్క్రమణం)

కెలై మనను అల్లకల్లోలంగావుంది — మీర్జామనను తుఫానులో కొట్టుకు
పోతూంది — తెరలో పోరాటం ఆరంభమైంది—

సంగ్రాం—అదిగో ! తొండంతో మెలివేసి గట్టిగాపట్టుకుంది ! ఆయ్యో ! అయ్యో !—ఆ —తప్పించుకుంటున్నాడు.

కెలై—Ah ! there ! there ! హోషియార్ ! షేర్‌ఖాన్ ! హోషియార్ That's Right ! That's Right ! Glorious !

సంగ్రాం—తొండాన్ని తోటకూర కాడవలె తునాతునకలు చేశాడు సమ్రాట్ !

జహాన్—బహాదురుసుంహై ! బహాదురుసుంహై !

సంగ్రాం—అదిగో ! అన్నయ్యో ! ఈశ్వరి కాళ్ళతో తరిమించుకుంటున్నది! అదిగో ! అయ్యో ! అయ్యో !

మీర్జా—జహాంపనా ! కాళికింద నలిగిపోతున్నారు ! చూడండి ! చూడండి అయ్యో ! అయ్యో ! దయచేసి పోరాటం ఆపించండి !

సంగ్రాం—ఆరెరే ! తప్పించుకున్నాడే ?—బలే ! బలే ! కాలును చొప్ప కట్టను నరికినట్లు రెండు ముక్కలుగా చేశాడు.

కెలై—Wonderful ! Wonderful !

సంగ్రాం—బాప్రే ! వీరావేశంతో ఎగిరి ఏనుగు మీదికెదూకి దానికణత కత్తితో అడుగంట తవ్వుతున్నాడు సమ్రాట్ !

కెలై—Treachery ! Treachery ! మోసం ! ఆ మావటివాడు చూడు ! వెనుకనుంచి కత్తిదూస్తు తున్నాడు ! I will shoot that nigger ;

మీర్జా—ఇంత అన్యాయమా ?

కెలై—షేర్‌ఖాన్ ! మావటివాడు జాగ్రత ! — ఆ ! Right ! That's right ! Dispatch him to the Devil ! Right !Glorious !

సంగ్రాం—మావటివాడు చచ్చి క్రిందకు దొర్లాడు. ఏనుగుచచ్చి విల్లిలా పడ్డది. ఇంకేవుంది ! కథ కలాస్ !

మీర్జా—(పెద్ద నిట్టూర్పుతో) అల్లా ! తుమ్హీహో రక్షక్ ! తుమ్హీహో రక్షక్ !

(రక్త సిక్తాంగంతో షేర్‌ఖాన్ ప్రవేశిస్తూ)

షేర్—జయహో ! మేరె స్వామి జహాంగీర్ బాద్‌షా కీ జయహో!

జహాంగీరు తనమెడలోని పతకము అతని మెడలో వేసి, వీపుకొట్టి నిశ్శబ్దంగా వెళ్ళిపోతాడు.

కౌశై — షేర్ ఖాన్! నీవంటి యోధుణ్ణి కన్న ప్రేమతో నాభూమాత ఎంతపులకరిస్తున్నదో. (నిష్క్రమణం)

మీర్జా — (జహాంగీరు వెంటవెళ్తూ) బేటా! నేను బాదుషాను పంపించి నీకోసం పల్లకితో ద్వారంవద్ద సిద్ధంగా వుంటా! (అటూ నిష్క్రమణం)

(షేర్‌ఖాన్ కూడా వెళ్ళబోతూంటే)

సంగ్రాం — షేర్ ఖాన్!

షేర్ — (ఆగును)

సంగ్రాం — సామ్రాట్టుకు నీమీదవున్నంత ఆదరం, అభిమానం, అనురాగం తనకొలువులోవున్న ఏ యితరఉద్యోగి మీద కూడా సభలో, సభవిష్యతి, అనినాకు ప్రచండమైన అనుమానం.

షేర్ — నీ సదభిప్రాయానికి నా సలాములు.

సంగ్రాం — షేర్ ఖాన్! ఆయనకు నీపైగల అనురక్తియే గొప్పదో - నీకు ఆయన యెడలగల రాజభక్తియే గొప్పదో నిర్ణయింపగల ఏదైనా ఒక వినూత్న ఘట్టం తటస్థించిన యెడల ఏమిజరుగునో!

షేర్ — (మాట్లాడడు)

సంగ్రాం — ఆహాహ! అట్టి సమ్రాట్టుకోసం నీవంటి రాజభక్తిపరుడు చేయజాలని స్వార్థత్యాగమూలేదు! అట్టిరాజభక్తిపరుడైతే ఆ సమ్రాట్టు కరిణించజాలని ధనధాన్య మణి కనక వస్తువాహన బిరుద లాంఛనములూ లేవు. షేర్ ఖాన్! ఏమంటావ్?

షేర్ — నీ ప్రసంగం వీనుల విందుగా వుంది

సంగ్రాం — ఇంతయేల? అట్టిస్వార్థత్యాగం ఒకటి నీవల్ల కావాలిఅని ఆ సమ్రాట్టు ఆ జీవనదాత ఇట్టె ఒక్కసారి మాటవరుసగా అంటేచాలు, నీవంటియోధుడు ఏత్యాగమైనా చేస్తాడు. పంచాగ్ని మధ్యంలో అవలీలగా పడిపొమ్మన్నావా, ధవళ శిఖరాగ్రం నుండి దుభాలున దూకిరమ్మన్నావా, లేక జగ మనస్సును హరించిన ఎట్టి వస్తువును కోరినా, వస్తువునే కాదు, ప్రాణమిత్రులను, ఆప్తబంధువులను, తల్లిని, తండ్రిని, అన్నలను, తమ్ములను, కొడుకులను, మాటవరుసకు ప్రాణ సమానమైన భార్యనైనాసరే—

షేర్ — అధముడా! ఆపు నీ అసభ్య ప్రసంగం.

సంగ్రాం — కాదు షేర్ ఖాన్! రాజభక్తి—

షేర్ — భక్తి? ఇట్టిదా నీ రాజభక్తి? గ్రహించా. నీవు నీ రాణాసాహెబ్ ఎదుట మను సమ్రాట్ వల్ల ఆజ్ఞ ఆగ్రహించి యేమంటువను ఇప్పుడు విస్పష్టమైంది. తుచ్ఛుడా!

వంది—క్యాహై వో !

మాగ—ఓ షేర్‌ఖాన్‌కా గల్లామే హార్ డాల్కే చుప్కేగయా ! వొక్కట్‌భీ కూడా మాటసెప్పలేద్ !

వంది—వాది వుండాదిరే దేవతారహష్యం.

మాగ—అరె ! మాకీభీకొంచెం తెల్సు—ఓ షేర్‌ఖాన్‌కా ఏక్‌వొడ్యాడ్ హై ఉస్కా నాం మెహరున్నిస్సాహై, ఓబడీ అందచందంకర్కే వుం సునా! ఓ వొడ్యాడ్ పర్ బాదుషాకీ జరా—హి—హిహి—

వంది—జర్రా కామూరే-పూరావుంది.

మాగ-భాయీ ! ఓ మెహరున్నిసాకు పాదుషా ఎప్డు చూశాడ్ ? ఎల్లా చూశాడ్ !

వంది—పదిమీద వారసమత్సరాల్ కింద-ఎప్డూ మెహరున్నిసాకు పెండ్లికాలేద్ వొక్కరోజ్ జనానాలో బడీనాచీ వచ్చీగా జర్గింది. వొక్డా అక్బర్ పాదుషా వున్నాడ్-ఔర్ సలీం, అంటే జహాంగీర్ భీ వున్నాడ్.

మాగ—ఫిర్ క్యాహువా ?

వంది—వొక్డా ఓ మెహరున్నిసా సేసింది వొక్కేనా- పాడింది వొక్కేపాట వాడీనూసి జహాంగీర్ సాబ్ ఏక్‌దమ్ దివానాహోగయా.

మాగ—ఫిర్ ఓ మెహరున్నిసాను ఫట్కోని జహాంగీర్ వొందుకు సేస్కోలే ఫెల్లి?

వంది—సేస్కోవాలాఅని బడీఖుషీ సేశాడ్. మగర్ మెహరున్నిసా మాఫిక్ గరీబ్ బేటీ కోడల్ హైతే పాదుషాకు పరువనష్టంహానీ, ఓఅక్బర్ జహాంగీర్కో దబాయించి ఓ మెహరున్నిసాను షేర్‌ఖాన్‌కీయిచ్చి నిఖాసేసి, హద్దర్నిపట్టి ఆగ్రానుంచి బర్ద్వాన్‌కు తోలిపాకేశాడ్. జోధ్‌పుర్ బాయికీ తెచ్చి జహాంగీర్కు నిఖాసేశాడ్.

మాగ—అరెరె ! పద్ధార సవత్సరాల్ గడ్సిపోయినా ఓ పాదుషాకు మెహరున్నిసామీద ఇర్నా బడీ గర్నాగరంమే వుంకిరే!

వంది—హాం!—మర్రిసెట్టు వొక్కటీ, మన్సిప్రేమా వొక్కటీ, తల్లికరుపట్టి పెల్లగించక పోతే, ఉన్నాకొద్ది వూడల్ పెట్టి, కన్నుమిన్ను కప్పేస్తాదికే !

మాగ—క్యారే ? ఓ మెహరున్నిసాకుభీ పాదుషామీద ఇర్నావుండాదా ? లేదా ?

వంది—అరె వొడ్యాడ్కి మన్సె ఏంవుండాదో వాల్లాకీ తెల్సు !

(అప్పుడు రొనరొనలాడుతూ మోతీప్రవేశం)

మోతి—(మాగధుణ్ణి చెవిపట్టుకొని శ్రుతిచేస్తూ, ఇక్కడ మిడుకుడూ ఇకా నువ్వు చేస్తున్నపని ? నడిబజారులో అంతఃపుర రహస్యాలన్నీ ఆలాపన చేస్తున్నావా ? అయ్యో ! అయ్యో ! గూఢచారులెవరైనా వింటే కొంపమునిగిపోతుందే !

వంది—హాఁ—ఎంత పెర్మానం! నీ మొగుడీకి హార్టు ఎంతా గట్టివుందో, లేకపోతే రంకొన్కి ఖోట్టువుందో హాడీ నా ఖరీహిస్సిం ఏనందుకు నాకీభీసిచ్చ హైతాడి. మగర్ మోతీబాయ్ ! హి హి హి ! నీదయా ఖ్యాంచా నాకీమీదవుంటే, పిచ్చాభిరాని నచ్చి పోతా.—

మోతి—నోరుకట్టిపెట్టు. నా మొగుడు షేర్‌ఖాన్‌వంటి వీరుడు కాకపోయినా నీజహాంగీరుతనం మటుకు నావద్దరసాగదు. వింటున్నావా ? కదిద్ దాక్ ! — రా ఇంటికి పోదాం ! (అంటూ మాగధునితో నిష్క్రమణం)

వంది—బాప్రే ! హీరామోతీసూస్తే మంచిహాందమైన పువ్వు • క్యాఫాయిదా ! హీ పువ్వులో హాందం వుందిగాని గంధంలేదు !

(అనిపోవుచుండగా సంగ్రామసింహుడు ఎదురుగా ప్రవేశం)

సంగ్రాం—వందీ !

వంది—హాఁ రాజాసాహెబ్ ! సలాం ! సలాం !

సంగ్రాం—నీవు ఉర్దూలోను సంస్కృతంలోను మాంచి పండితుడవట ?

వంది—హాఁ సర్కార్ ! మాబ్రాహ్మణ హమ్మెఅంతా బడీ పండిత్ హై ! మా నాయన ఉర్దూలో మాతాత సముద్రరసుకేతంలో బడీ పైల్వాన్ హై !

సంగ్రాం—పైల్వాన్ ! ?

వంది—హాఁ ! సర్కార్ ! హెంతా హెంతా మౌల్వీవచ్చి, హెంతా హెంతా పండిత్ వచ్చి, హెంతా హెంతా పరీచ్చా సేసినా మానాయనామాతాతావాళ్ళు ముక్కు ఫట్కాని మూడుగతాలు హిస్తే, తర్కం గిర్కం ఛోడ్కే దౌడ్ తీసేవాళ్లు సర్కార్! హాఁ !

సంగ్రాం—అయితే నీవంటి పండితపుత్రుడు ఇక్కడవుండగా ఊరంతా అనవసరంగా వెతికాను సుమా.

వంది—అప్కా క్యాహోనా సర్కార్ ?

సంగ్రాం—వచ్చింది, నీపాండిత్యానికి పరీక్షాసమయం వచ్చింది ! కానుకోమరి. ‘గ్రామసింహం’ అనేపదం ఏభాష ? దానికి అర్థమేమిటి ?

వంది—గ్రాంసింహం ? ! అర్ర్ ! హిది దేవతా భాషాఅండీ !

సంగ్రాం—గొప్పభాషయేనా ! నేనూ అలాగే అనుకున్నానురా ! కాని,— ఆమాటకు అర్థంఏమిటి ?

వంది—అర్థం ? గ్రామానిక్కి సింహంవంటివాడు గ్రామసింహోజీ !

సంగ్రాం—హిహిహి ! భేష్ ! భేష్ !— కాని-చూడు- గ్రామాల్లో ఎక్కడైనా సింహాలు ఉంటాయా ? నేనెక్కడా చూడలేదు.

వంది—ఇంకా అర్థం కాలేదా సర్కార్ ?

సంగ్రాం—కాలేదు-అంటే-మరి.

వంది—అచ్ఛా ! సునోసర్కార్ ! అసల్‌సింహం అడవిలోవుండే జంగ్లీ-సింహ సింహం గ్రామంలో తిర్గే ఘరానా. హాకి మన్సీకిమాస్తే మర్యాదకేసి మూతితెరిసి పళ్ళు చూపిస్తాది. హీకీ మన్సీకిసూసి మర్యాదసేసి తోకఆడిస్తాది.

సంగ్రాం—తోక ! ?

వంది—హాఁసర్కార్ !

సంగ్రాం—అరెరె ! — ఇదా ! — కుక్క ?

వంది—కుక్క కాదు సర్కార్ ! — షున్కం ! భైరవ్ !

సంగ్రాం—(ఒరలోని కత్తిమీద దర్జాగా చేయివేసి) హూఁ((( !—ఓరీషేర్‌ఖాన్

వంది—క్యాహువాసర్కార్ ! ఓషేర్‌ఖాన్ రాజాసాహెబ్కు ఘటోత్కని హింతమాట హాన్నాడువాఁడీ ?

సంగ్రాం—నన్నా ? — అబ్బే ! — నన్నుఅంటేమాట అనడమే ! — నన్ను కాదు—మరి—

వంది—మేం హెవరితోనూ-షెప్పంలేండి సర్కార్ !

సంగ్రాం—అబ్బెబ్బెబ్బే! నన్ను కాదు. నాబోటకొలిపంచేక నాకమ్మన్ని అన్నాడట!

వంది—బిక్కీతమ్ముడు హెక్కడవుండాడ్ సర్కార్ !

సంగ్రాం—ఉన్నాడు. చాలాదూరదేశంలో వున్నాడు. చిన్నపొద్దున్నేవచ్చి మధ్యాహ్నమే వెళ్లిపోతూడు. వెళ్లనియ్ ! అరేఁ అన్నను నేనులేనాయిక్కడ? ఈఅవమానాన్ని ఆ షేర్‌ఖాన్ రక్తంలో కడిగి కడిగి రూపించువరకు ఈ గ్రామసింహుని (ఔడుకరుచుకొని) — ఈ సంగ్రామసింహుని కంటికి నిదురవచ్చుట కల్ల !

(ఒకభటుడు ప్రవేశించి సలాముచేసి)

భటు—రాజాసాహెబ్ ! వెంటనేవచ్చికలుసుకొమ్మని సమ్రాట్టులవారియాజ్ఞ !

సంగ్రాం—హాజర్ ! హాజర్ ! (భటునితో నిష్క్రమణం)

వంది—జహాంగీర్ బాదుషా హెన్ని బిరుదుల్‌హిచ్చినా, ఈ సంగ్రాంజాదాకు

షేర్‌ఖాన్ హిచ్చిన బిరుదు సుల్తాన్ పాదుషాహి. ...జాల్ హిచ్చినబిరుదు రంగుమెరిసే బిరుదు. లోకుల్ హిచ్చిన బిరుదు లోకం తెల్సిన బిరుదు!

(నిష్క్రమణం)

## రంగం మూడు

## దృశ్యం మూడు.

(తండ్రికోసం నిరీక్షిస్తూ శైలా దండలు గుచ్చుతూ పాడుతోంది. శైలాకు సాయంచేస్తూ మధ్య మధ్య మెహెరుకూడా పాడుతోంది, పాటమధ్య మీర్జా గయాష్ ప్రవేశం. అతనిముఖభావం పరికించి శైలా మెహెర్లు కంగారు పడతారు.)

శైలా—దాదా ! నాయనగారేరి ?

మెహె—అబ్బా ! వారేరి ?

మీర్జా—మెహెర్ ! శైలా ! షేర్‌ఖాన్‌కు కుశలం. ఆందోళనపడవద్దు. పాదుషాఆజ్ఞచేత షేర్‌ఖాను ఏనుగుతో యుద్ధం చేశాడు. షేర్‌ఖానే గెల్చాడు—ఏనుగే హతమైంది. కాని అక్కడక్కడ చిన్న గాయాలు తగిలినవి. పల్లకీలో ఎక్కించమన్నాను కాని కొంచెంసేదతీరినతర్వాత మళ్లీపల్లకీ మీదనే ఇక్కడికి తీసుకువచ్చాం. అదిగో .

శైలా—బాబా ! బాబా ! (అటూ శైలా వెళుతుంది)

మెహె—(కూడా పోబోతుంటే)—

మీర్జా—(ఆపి) మెహెర్ ! తర్వాతచూతువుగాని—ముందు లోపలికిపోయి ఉపచార సామగ్రి తీసుకురా ! —

మెహె—(ఎటుపోవుటకు తోచక, చివరికి ఇంట్లోకే వెళ్లుతుంది ఉపచార సామగ్రికోసం)—

(శైలామీద ఆనుకొని షేర్‌ఖాను ప్రవేశం. షేర్‌ఖాను సోఫాలో కూర్చుంటాడు, ప్రక్కనేకూర్చుంటుంది శైలా. శైలాకళ్లల్లో అశ్రువులు ఉబుకుతున్నాయి).

శైలా—బాబా ! ఏనుగుతో పోరాడిగెల్చివచ్చావా ! ఎంతఅద్భుతం ! ఎంత ఆనందం ! కాని—బాబా ! ఆపాదుషా ఎప్పుడూ నీచేత ఇలాంటి ప్రమాద కార్యాలే చేయిస్తాడేమిటి ?

మీర్జా—శైలా ! తర్వాతమాట్లాడవచ్చు. నీవుకూడా లోపలికివెళ్లి మీఅమ్మకు సాయంచెయ్యి.

శైలా—సరే. (శైలా నిష్క్రమణం)

(ఇకజరుగబోయే సంభాషణలో మధ్య మధ్య మెహెరున్నిసా వస్తూ పోతూ ఉపచారాలుచేస్తూవుంటుంది. ఆమెవచ్చినపుడు మీర్జా షేర్‌ఖానులు తమ సంభాషణ ఆపు తారు.)

మీర్జా—షేర్‌ఖాన్! జీవనమరణసమస్య ప్రళయజీమూతములవలె ఫెళ ఫెళార్భటులతోవచ్చి పడ్డది. ఇక శ్రేయస్కరం కాదని ఇన్నాళ్లూ దాచివుంచిన మెహెర్ వివాహ పూర్వగత గాథ ఇన్నాళ్లకనీకుచెప్పివేశా. ఇక ఒక్కటేమార్గం శ్రద్ధగావిను — షేర్‌ఖాన్! నీధ్యానం ఇక్కడలేదు !—

షేర్— జీవనమరణ సమస్య ? — మార్గం ! — మామా ! దేనికామార్గం ? ప్రాణాలు రక్షించుకోడానికా ?

మీర్జా—ఔను. నీవునీకుటుంబాన్ని వెంటబెట్టుకొని ఈ యాగ్రానుంచి ఈక్షణం పారిపోవుట ఒక్కటేమార్గం. పులిని, ఏనుగును, మూపటివానిని నిమిత్తమాత్రంగా చేసిపన్నిన గూఢ తంత్రాలన్నిటిలోను ఆతడు విఫలుడయ్యాడు. తుదకు సంగ్రాంచేత నీకు విస్పష్టంగా చెప్పించికూడా విఫలుడయ్యాడు. ఇక ఆతడు విఫలుడు కాదలచుకోలేదు ఈ ఆగ్రానుంచి నీవుఎప్పుడు ఎక్కడికి పారిపోతావోఅని ముందుగానే అనుమానపడి, వలసిన కట్టుబాట్లన్నీ అహోరుంగా అతినిర్దాక్షిణ్యాంగా చేయించివుంటాడు. షేర్‌ఖాన్ ! ఈక్షణాలలో ఈ యిల్లేకాదు, ఈఆగ్రా మహానగరమంతా నీపాలిటి అఖండ కారాగారంగా నిర్మాణమై వుంది. అయినప్పటికీ, ఇకీరాత్రివేళ—తప్పించుకొనిపోవుటకు అవకాశంవుంది. నాయనా! వెంటనే వెళ్లిపో ! ఇదే నాహితోపదేశం. పొద్దుపోయింది. ఇకనాకు అనుజ్ఞ!—(మీర్జా నిష్క్రమణం)

షేర్—(రోషక్రోధాలు మూప్పిరిగొంటున్నవి) ఏమేమీ ! లోకములో ఇంతటి నైచ్యము ఇంతటి దౌర్జన్యము నిజముగానుండునా ?

సీ. నాపాలి బందిఖానా చేసెనా పాదు
షా నీచబుద్ధి నాగ్రానగరిని ?
పరసతీవాంఛ కభంగ విహారమా ?
తన సతీరతికు దారిసున్న ?
ఆతతాయికిఫలం బాయు వారోగ్యమా ?
శిష్టుకు బహుమతి చీకు చింత ?
కత్తికోత కసాయిని త్తిం బువ్వులవాన ?
గొరియల మెడల కత్తెరల బోన ?

పుడమి వైఖరి యిదియో ? నే పొరబడితినో ?
తారు మారయ్యెనో సత్య తత్త్వమవని ?
అడవిచూడంగ పీతసింహము సివారు
గ్రామములు చూడ దొంగకుక్కల బజారు !

ఈ తారుమారు అసహజం. ఇదిదారుణం. ఔను (అంటూవుండగా మెహెర్ ప్రవేశం) మెహెర్ ! నాఖడ్గం ఇటుతే !

మెహె—అదేమి ?—ఎందుకుస్వామీ ?

షేర్—ఈక్షణం జహాంగీరు వద్దకుపోయి ఈసమస్యను భయంకరంగా పరిష్కారం చేసుకొనివస్తా.

మెహె—స్వామీ ! తెలిసికూడా మళ్ళీవెడతారా ! ?

షేర్—ఔను !

మెహె—వద్దు వద్దు స్వామీ ! మళ్ళీ ఏదైన ప్రమాదం వస్తుంది.

షేర్—రానీ ! నీకు మరీమంచిది. అప్పుడునీవు నిరాటంకంగా భారతసమ్రాజ్ఞివి కావచ్చు—

మెహె—నాథా ! ! !—పరిహాసమా !

షేర్—కాదు-ఇది జీవన మరణసమస్య. మనస్ఫూర్తిగా చెబుతున్నా-బ్రతుక వలె నను అభిలాష నాకులేదు.

మెహె—ప్రాణపతీ ! నేడు ఇంతవిపరీతంగా మాట్లాడుతున్నారేం ?

షేర్—మెహెర్ ! ఎటుచూచినా ఒక్క టేదృశ్యం-మృత్యువు ! ఎటువిన్నా ఒక్కటే ధ్వని-దానవహుంకారం ! రేబవలు ఈ దృశ్యాన్ని చూస్తూ ఈ భయంకర ధ్వనిని ఆలకిస్తూ విశ్రాంతుడనై వికలచేష్టుడనై యెంతకాలం పడివుండాలి ?....

మెహె—అటులైన నాథా! అందరం ఇప్పుడే వెళ్ళిపోదాం. మనకు అసమ్రాట్టు వద్ద ఉద్యోగమేవద్దు. నామనవి ఆలకించండి. ప్రాణేశ్వరా !

శా. ఆ దుష్టాత్ముని తుచ్ఛ మోహకలుషవ్యాసక్త నిశ్వాసమే
యే దేశంబులు ప్రాకిరాంగలుగునయ్యో దేశముల్ జేరి, యే
ట్లో, దారిద్ర్యమో? కల్మిరామో? కలియో? గంజో ? కష్టమో?
సౌఖ్యమో?
నీడోరీతిని బొట్టబోసుకొనలేమే నాథ! పోదాము ! రా!—

షేర్—కాదు, మెహెర్ ! విపత్తుకు వెరచి వెన్ను చూపుట నా పద్ధతి కాదు. నేనే ఎదురేగి దానికి స్వాగతమిస్తా. మరణము తప్పదా ?—తృణీకరిస్తాను. అదియు నీకొఱకే (గాద్గదికంతో) మెహెర్ ! నీకోసం మరణించుట కూడా ఒకసుఖమే. అదీ గాక, చెప్పదు గా ?–వద్దు–కాదు–చెబుతా–మెహెర్ ! కాపరమని మరణంకోసం నేనే వెతుకుతున్నా.

మెహె—ఎందుకు స్వామీ !

షేర్—ఎందుకా ? నామీద నీకు ప్రేమ ఉండజాలదని గ్రహించడం చేత—

మెహె—ఎంతమాట ! ఎంతమాట !—నాథా !—నాథా !—

షేర్—ఔను. మెహెర్ ! ఇన్నాళ్ళూ నేను ఒక అగాధ స్వప్నంలో ఉన్నాను

సీ. ఆల జహాంగీరు షాహంషాహా మహిషియై
రాణింపదగిన సిరాణ యేడ !
ఊరు పేరులు లేని షేరుఖాను నింట
నిష్ప్రచ్ఛరమ్మున నిల్చు టేడ ?
హారుమంజ ముత్యాల తెరలు గట్టిన తూగు
టుయ్యాల లందూగు యోగ మేడ !
జీర్ణాంశుకములతో జీరుకాడుచు సదా
పర్ణశాల వసించు ప్రాప్తి యేడ ?
తొంగలుగద్దె నధిష్ఠించి, జగతికన్ను,
మెరుపు మెరుగులతో మిరుమిట్లు గొలుపం
గలుగు మణిదెచ్చి, మసిపాత గట్టినాడ !
లోభి ప్రేమకు జగమాని లోతు కలదె ?

మెహె—(ఏడుస్తూ) స్వామీ ! స్వామీ ! ఈవిధంగా ఎన్నడైనా అన్నానా నేను ?

షేర్—అనలేదు. అనకపోయినా నేను ఊహించుకోవాలి. కాని ఆ ఊహ నాకు కలుగలేదు. మా నవప్రకృతి, అర్థం చేసుకోవాలనే విషయమే నాకు స్ఫురించలేదు. ఎందుకంటే, మెహెర్ ! నా ప్రేమ కన్నిగుడ్డి–విరిచేస్తుంది !

మెహె—స్వామీ ! నా ప్రేమదేవతా ! క్షమాకరో ! క్షమాకరో ! (పాదాల మీద పడుతుంది).

షేర్—కాదు–మెహెర్ ! తప్పు నీది కాదు. నాది ! నీ సుందరిని పత్నిగా బడయుటయై జహాంగీరువంటి చక్రవర్తి పిచ్చివాడై తిరిగెనో, ఆమెను ఈ దౌర్భాగ్య

షేర్‌ఖాను పెండ్లి యాడుట అగ్గితో మిడుత చెర్లాటంగాక వేరేమున్నది? మెహార్! ఇక వెడతా! దేనికంటే, నీవంటి అమూల్యరత్నం ఇంకొకనికి అనాయాసంగా లభిస్తే, ఆ రత్నానికి విలువవుండదు. కాబట్టి అగ్రపూజ్యాన్ని ఈ భీకర కరవాలానికి ఆతడు అర్పించుకొనిన అనంతరంనిన్ను పరిగ్రహించుగాక! (పోతూవుండగా)

మెహ—(కాళ్లకు అడ్డపడి) వద్దు! ఆగండి! స్వామీ—

(షేర్‌ఖాను విదిలించుకొని వెళ్లతూవుంటే సంగ్రామసింహుడు ప్రవేశం)

సంగ్రాం—ఆగు షేర్‌ఖాన్! ఆగు! నీమృత్యువు నీయింటికే వచ్చినిల్చింది. అంతదూరం పోనక్కరలేదు. (కత్తిదూయుచు)

ఉ. మృత్యువు మృత్యువాయెడుచు నెంతయు నీవటు దేవురింపగా
భృత్యుని కోర్కెదీర్ప దయబెంచి జహాంగిరు నన్నుఁబంపె! నీ
మృత్యువు చూడు కత్తికొనకే నిలువంబడె! రమ్ము స్వర్గ సాం
గత్యము! అప్సరో వరల కౌఁగిలి! రాయిక! రమ్ము పోలిశా!

షేర్—(కత్తిదూయుచు) ఓరీ! అభిమానహీనా!

చ. హితులగువారి యిండ్లఁబడి, యెంగిలికంచము చుట్టుబడ్డ యా
మెతుకులు నోటితో గతికి, మెండుగ వాలముఁ ద్రిప్పి, కుట్టెను
ద్ధతిఁ బయికెత్తు మన్ శ్రవణదారుణగానము చేసినంతనే
శునకలవోంగకుక్కలను సింహములందురె? గాండ్రుసింహమా!

మెహ— ఇట్టి గులామును చంపుటకు మీ వీరఖడ్గము కావలెనా? నిలు వాంతకా! నిలు!

(బాకుతీసి మెహెర్ సంగ్రాంమీదికి లంఘిస్తుంది. షేర్‌ఖాన్ ఖడ్గహస్తుడై ఆతన్ని ఎదుర్కొంటాడు. సంగ్రాం ఈలవేస్తాడు. పక్క తెరలగుండా హంతకసమూహం వచ్చిపడుతుంది. సంకులసమరం. లైలాప్రవేశం. లైలా మెహెర్లు బాకులతో పోరాడుతారు. షేర్‌ఖాను చాలామందిని తనకత్తికి బలిపుచ్చుకుంటాడు. ఇకపూరుకుంటే లాభం లేదని సంగ్రాంసింగు తనపిస్టల్ తీస్తాడు. బాగాగురిపెట్టి షేర్‌ఖానుమీద పేలుస్తాడు. షేర్‌ఖాన్ 'అల్లాహో అక్బర్!' అంటూఅరిచి వెంటనే హతజీవుడై పడిపోతాడు. "స్వామీ, స్వామీ" అంటూ మెహెరున్నిసాయూ, "బాబా! బాబా!" అంటూ లైలాయూ బిగ్గరగా అరుస్తూ షేర్‌ఖాన్ శవంమీదపడి యేడుస్తూవుంటే, వాళ్లిద్దర్నీ మిక్కిలిబలాత్కారంగా లాగి, నోటగుడ్డలుకుక్కి, కాళ్లూచేతులూ కట్టివేసి మోసుకొనిపోతూవుండగా

(తెరమెల్లగా వాలుతుంది)

# అంకం రెండు

## దృశ్యం ఒకటి

(ఆగ్రా మహల్లోపల)

మెహె—లైలా ! -ఒకసారి-రానాదగ్గరికి- (లైలాకు ఉత్సాహంలేదు) ఇకనీవే నాసర్వస్వం.

లైలా—అమ్మా !

మెహె—లైలా! క్షీణచంద్రునివలె నీముఖబింబం రానురానూ శోభాహీనం అవుతున్నదెందుకు ?

లైలా—నీకు తెలియదా ? అమ్మా ! ఈ మహల్లోకి అసలు ఎందుకువచ్చావు ?

మెహె—రాకుండా తప్పించుకొనే ఉపాయం కనపడలేదుగదా.

లైలా—విషంత్రాగి చావటానికికూడా ఉపాయం కనపడలేదా? అమ్మా! బ్రతుకుమీద నీకుయింత మమకారం వుందని నేననుకోలేదు. ఎవడు నాకన్నతండ్రిని నిష్కారణముగ హత్యగావించెనో ఆకసాయి ఆకిరాతుడు ఆపాషాణ ఆయధికారమదమత్తు---

మెహె—లైలా ! లైలా ! ఆగు.

లైలా—నేనాగను. ఇక ఆగలేను. దినదినము మంటలు ఎగదోస్తున్న ఈ అంతర్జ్వాలను ఇక ఆపలేను. ఆ జహాంగీరు నాతండ్రిని దొంగపోటున అత్యాంతికలి ఏకాకిని చేసి దారుణహత్య గావించెనను వార్త భారతభూమండలమంతా ప్రతిధ్వనించేటట్లు మేఘగర్జలతో ఘోషిస్తా. నానాలుకలో వాక్కు సల్పుయుండునంతవరకు ఈ దిగంతరాళమంతా నా రోదతో నిండి నిక్షుభిత మయ్యేటట్లు ఘోషిస్తా. ఆ హంతకుని కళంక మషీమాలిన్యంతో ఆకాశమంతా కరాళ కాళిమచ్ఛటా పటలమయ్యేదాక ఘోషిస్తా !

మెహె—బేటీ ! భర్తను పోగొట్టుకొన్నా ! ఈమహాలులో ఇట్టిప్రసంగం ఇంత నిర్భీకంగా ఇంత బహిరంగంగా నీవుచేస్తే నిన్నుకూడా పోగొట్టుకొని నే నేంచేసేది ! తల్లీ !—

లైలా—అంటే ! పాదుషా నన్నుకూడ హత్యచేస్తాడా ! చేయని ! నేనువణికే దాన్ని కాదు. నీవలె ప్రాణంకోసం ప్రాకులాడే దాన్ని కాదు. చూస్తా ఎవరాపుతారో ! అమ్మా ! రాయిక్కడనుంచి పోదాం !

మెహె—లైలా ! అనుజ్ఞలేదుగదా !

లైలా—అనుజ్ఞ ఎవరిది ? ఎందుకు ? మనము ఖైదీలమా ?

మెహె—ఔను బేటీ.

లైలా—ఏమి అపరాధం చేశాం?

మెహె—తెలియదు.

లైలా—(కోపంతో) అమ్మా! నీవు బలాత్కారం చేతనే ఇక్కడికి వచ్చావు అంతవరకు నాకర్థమైంది. మరి, వచ్చి నాలుగేండ్లు కావస్తున్నది. ఇంతవరకు నీవు ఒక నాడైనా ఈ చెరనుండి విముక్తురాలవగుటకు యత్నలవలేశమూ చేసినట్లుకూడ నేను చూడలేదు. యథావిధంగా, కులాసాగా, ఈ ఆగ్రాయే మనబర్ద్వానన్నట్లుగా ఈమహాలే మన ఇల్లన్నట్లుగా కాలక్షేపం చేస్తున్నావు. నిజం చెప్పు. అసలు ఇక్కడనుంచి నీకు పోవాలని వుందా లేదా?

మెహె—వుంది.

లైలా—ఉంటే సమ్రాజ్ఞి జోధపురీబాయి ద్వారా అనుజ్ఞకోసం ఎందుకు ప్రయత్నం చెయ్యవు?

మెహె—సమ్రాట్టు అనుజ్ఞ ఈయడు.

లైలా—తప్పక యిస్తాడు-నేనంటున్నా! ఇచ్చితీరుతాడు. నీవు ప్రయత్నం చేసి చూస్తేకదా! చెయ్! చేస్తావా?

మెహె—చేస్తా.

లైలా—అయితే ఆకష్టం నీకేమీవద్దు. నీవిముక్తికి సాధించుకొని వచ్చే బాధ్యత నాది. నేనే వెడతా. ఆ సమ్రాట్టు ఎందుకు ఈయడో చూస్తా. పోనీ. (నిష్క్రమణం)

మెహె—వద్దు నీవువెళ్ళవద్దు! బేటీ! బేటీ!—అతను వాంఛకుడు సుమీ—విను—బేటీ!

మోతీ—(కానుకల పళ్ళెంతో ప్రవేశం) అమ్మా! ప్రభువులవారు ఈసారి మరీ మరీ చెప్పుతున్నారు ఈకానుకలు మీరు తప్పకుండా స్వీకరించాలట! తల్లీ! రాజులు మహారాజులువచ్చి వంగివంగి సలాములుచేసి ఎన్నెన్నో కానుకలు ఇస్తే క్రీగంట చూచి చూడనట్లుండే ప్రభువుకు, ఇన్నాళ్ళకు నచ్చిన కానుకలంటే ఆసక్తి-ఇంకొకరికి పంపించడమంటే ఇంకా ఆసక్తి-తప్పకుండా స్వీకరించండి అనిచెప్పమనడంటే మరీ మరీ ఆసక్తి-

మెహె—(కానుకల పళ్ళెరాన్ని అమాంతంగా పడత్రోసి) ప్రలాపినీ! నోరుకట్టి పట్టు! ఇంకొకసారి నీచపుపదమ్మనా నీప్రభువుపేరు ఉచ్చరించినా-జాగ్రత! - పో! పోమెందవా? లేదా? ఊం- బేటీ! బేటీ!

మోతీ—అమ్మా! భారతసామ్రాజ్యలక్ష్మి తనకుతానై వచ్చి పడుతుంటే కాదని కాలదన్నుకుంటావా? ఆ ప్రభువులవారికి మీమీద ఎంతప్రేమ? — ఎంత.

(మెహెర్ మోతీని బలవంతంగా నెట్టివేస్తుంది)

మెహె—ఎట్టి దుస్థితి వచ్చిందినాకు!

# దృశ్యం రెండు

(ఆగ్రామహల్లో వీధి-వంది మాగధులు ప్రవేశం)

వంది—(శోకం నాటకం) వచ్చిందిరే వచ్చిందిరే! మొగుల్యా రాజ్యం మునుకుపోయే తుపాను వచ్చింది !

మాగ—క్యాహువా ?

వంది—ఆగ్రాహంతా గడ్‌బడా హుడ్యేపోతుండాదిరే !

మాగ—క్యాహువారే !

వంది—సమ్రాట్ పెద్దకొడుక్కు యువరాజ్ ఖుస్రూసాబ్-హద్దెలెండా హొత్తాడురే !

మాగ—హెవరిమీద ?

వంది—తండ్రిమీద ! !

మాగ—ద్రోహం ?

వంది—హాఁ- తండ్రికి పట్టి హజామత్ సేసి, తన్కి సమ్రాట్ కావాలా అని తయ్యార్నే వుండాడ్.

మాగ—అరే ! తండ్రికి భత్కి వుండగా కొడుక్కు హింతపని సేస్తాడ్ !

వంది—అరె ! పెళ్లాన్కి భత్కి ఉండగా హింకొక్కి పెళ్లాన్కి పట్టాలిఅని తండ్రి వుండాలే తయ్యార్కి ?

మాగ—సచ్ హై ! తండ్రిహిల్గా! కొడుకుహ్లా! ఖబర్-వందీభాయ్ ! ఓ ఖుస్రూ సాబ్ అచ్చా ఆద్మీకర్కె హం సునారే !

వంది—హై-మగర్-రాజ్యం హొక్కి రండీ హొక్కి హెంతా అచ్చా ఆద్మీహైనా పట్టి లుచ్చా ఆద్మీ కర్ తీహై

మాగ—రే ! హిప్డూ గ్యాపక్ వస్తాకీకూకీ హొక్కి గహాష్టం. ఓ గ్రాంషింహాం వుండాడే హోడ్కి ఓ యువరాజాకూ సాలాసాత్తు మాలాఖాత్ హైంది. హొర్కి హిద్దర్కి హేమేమో రాత్‌దిన్ గుస్‌గుసా గుస్‌గుసా సేస్తూవుంటే మన్కి పెళ్లాం మోతీబాయ్ నూసిసెప్పింది.

వంది—అవ్వో ! ఓ షుస్కుంవాడు తోక హిల్గా ఫిరాయించిండి !

మాగ—రే ! రే ! ఈస్వర్ ఏ దేఖో ! ఓ గ్రాంషింహాం ఔర్ యువరాజా ఖుస్రూసాబ్ బాత్ కర్తే కర్తే ఇవరీ ఆరె. చల్ రే చల్.

(ఇద్దరూ నిష్క్రమణం)

(ఖుస్రూ, సంగ్రాం—మాట్లాడుతూ ప్రవేశం)

సంగ్రాం—యువరాజా! వెనుకముందులు యోచించవలసిన అగత్యంలేదు. అపాత్రుడైన తండ్రిని తొలగించి తనయులు తామే సింహాసనం అధిష్టించుట అన్ని దేశాల్లో అన్నిమతాల్లో పరిపాటియైన ధర్మం.

ఖుస్రూ—కావచ్చు కాని—నామనస్సు అంగీకరించటంలేదు.

సంగ్రాం—ఈ మహాపుణ్య కార్యంలో దేశమంతా మీపక్షం వహించడానికి సిద్ధంగావుంది. ఎందుకంటే ప్రజలందరికీ మీమీదవున్న భక్తికి అనురక్తికి అంతూపొంతూ లేదు. అన్నిటికంటె ముఖ్యంగా ఆ షేర్‌ఖాన్‌వంటి సింహబలుణ్ణి చించిచెండాడిన ఈ గ్రామ—ఈ సంగ్రామసింహుని భీకర కరవాలం మీసేవకోసం ఎప్పుడెప్పుడాయని తహతహలాడి పోతుంది.

ఖుస్రూ—మంచిదే కాని, 'పితృద్రోహి' అనే పేరు చరిత్రలో ఆచంద్రార్కంగా నిలబడి పోతుంది.

సంగ్రాం—చరిత్ర!—ఆ చరిత్ర వ్రాసేవాళ్లకు తలొక జాగీరు తలొక రాజా బహద్దరు తగిలిస్తే 'పితృద్రోహి' పేర్నే 'పితృభక్తి' గా సవరించి వ్రాసేస్తారు.

ఖుస్రూ—సంగ్రాం! తండ్రిభయం ప్రజాభయం చరిత్రభయం నాకులెక్కలేదు కాని మహాసేనాపతి—ఆయోధపితామహుడు—మహాబత్‌ఖాన్—అతను అడ్డువస్తాడేమో అనే భయంతో అచలా విచలం అయిపోతున్నా!

సంగ్రాం—అతనిపేరుచెప్తే నాకూ గుండెదడగానే వుంటుంది. కాని, ప్రభూ! అతనుమీకు అడ్డురాడని నా అంచనా. ఎందుకంటే యితడు పుట్టుకచే హిందువు. సామ్రాజ్ఞి జోధపురిబాయి కొడుకులు కావడంచేత మీలో కూడా హిందూరక్తం. కాబట్టి అభిమానం అతడికి తప్పకుండా వుండితీరుతుంది.

ఖుస్రూ—మహాబత్‌ఖానుకు హిందూ ముస్లిం పక్షపాతంలేదు. అతను రాజ్యపక్షపాతి—క్రమపక్షపాతి.

సంగ్రాం—కానిండు. ప్రజఅంతా మీపక్షాన్ని వున్నపుడు, మహాబత్‌ఖానువంటి వాడుకూడ తోకముడుచుకొని పోవలసిందే.

ఖుస్రూ—వట్టి మందలాంటి ప్రజ యేంచేయగలదు? సైన్యంఅంతా అతని చేతిలోవుంది. ఆసైన్యంఅంతా అతణ్ణి దేవుడిగా పూజిస్తుంది.

సంగ్రాం—అయితే-యువరాజా! గొప్ప ఆలోచన మెరుపులాగ మెరిసింది బుర్రలో.

ఖుస్రూ—ఏమిటది?

సంగ్రాం—సమ్రాట్‌కంటే ముందుగా మహబత్‌ఖాన్‌నే అంతరించాలి !

అంటూవుండగా అచటికే వస్తూవున్న మహబత్‌ఖాను దూరంగా సంగ్రాం కంటికి ప్రత్యక్షం అవుతాడు. సంగ్రాంకు వణుకుప్రారంభమైంది. మహబత్ ప్రవేశం.

సంగ్రాం—(వణుకుతూ) హిహిహి ! మహబత్‌ఖాన్‌జీ ! సలాం ! సలాం !

మహా—సంగ్రాం ! యువరాజుతో ఏమిటి చెబుతున్నావు ?

సంగ్రాం—హిహిహి !

మహా—సంగ్రాం !—నాప్రశ్న ?—

సంగ్రాం—హిహిహి ! అంటే-మరి-యువరాజువారికి మహారాష్ట్ర అప్పడాలంటే చాలాయిష్టం. అవి చేయించిపెట్టమని నాకు ఆజ్ఞయిచ్చారు. ఎందుకంటే నాది మహారాష్ట్రదేశమేగా. ఆఅప్పడాలపిండిలో శాస్త్రీయంగా ఉప్పు మెంతిపిప్పి, ఖొరాసానీ వాము చల్లి—

మహా—నీ కులవృత్తి ఆదేశాలో లు !—

సంగ్రాం—హిహిహి

మహా—ఆవృత్తి విడిచి ఈవృత్తిలోనికి రాకుండావుంటే ఈసామ్రాజ్యం ఇంకా ఎంత సుఖపడేదో !

సంగ్రాం—హిహిహి !

మహా—సంగ్రాం !—నేడుమొదలు ఈ యువరాజుతో నీవు ఎప్పుడు ఎక్కడ కనపడినా ఈ మహబత్‌ఖాన్‌వల్ల అక్కడనే నీకుమృత్యుదర్శనం ! నేటికి క్షమించి విడిచి పెడుతున్నా !—ఇకపో తొలగిపొమ్మని.

సంగ్రాం—హిహిహి !—

మహా—నాఆజ్ఞ వినపడలేదా !

సంగ్రా—హిహిహి !—(అంటూ నిష్క్రమణం)

మహా—యువరాజా !

ఖుస్రూ—దాదా !

మహా—మిత్రద్రోహప్రయత్నం మానండి.

ఖుస్రూ—మానను ! మానజాలను ! అసంభవం ! నాస్నేహితులతో ఒట్టుపెట్టుకున్నా.

మహా—ఇంతటిపట్టుదల యెందుకు కలిగింది ? మీ తండ్రిగారు మీకు ఏమిద్రోహం చేశారు ?

ఖుస్రూ—నాకుకాదు-నాకన్నతల్లి జోధపురీబాయికి చేస్తున్నాడు ద్రోహమంతా.

మహా—అర్థమైంది. కాని—

ఖుస్రూ—సేనాపతీ! నీవేమన్నా సరే! నా ప్రయత్నం కొనసాగించితీరుతా! తనంతవాళ్లం నలుగురు కొడుకులం కంటియెదుట నుండగా, తనకు జీవిత మధ్యాహ్న రేఖ దాటిపోవుచుండగా, నేటికి దురంత వ్యసనలోలుడై, ఒకభర్త నిండుప్రాణంతీసి ఒకభార్యను బలాత్కరించుటకై పన్నాగములు పన్నుతున్న ఈ తండ్రి నాకు జన్మదాతయే అగుగాక—

మహా—మీ ఆశయం కళంకరహితం—కాని, మీ ఆచరణ—

ఖుస్రూ—వద్దు-అడ్డుచెప్పవద్దు. దాదా! నీకు ప్రభువు తర్వాత ప్రభువును నేను. శిష్య వాత్సల్యంతో సంగ్రామ విద్యనంతయు నాకు నేర్పిన గురుదేవుడవు నీవు. కాబట్టి ఈ విషయంలో నీ సహాయాన్ని కూడా అర్థిస్తున్నా. అదిగాక నీవు పుట్టుకచే హిందువుడవు. నా తల్లి కూడ పుట్టుకచే హిందువు. ఆ. అభిమానం —

మహా—యువరాజా! ఆ ప్రసంగం అనవసరం. అప్పుడు 'రాం' అన్నాను ఇప్పుడు 'రహీం!' అంటున్నా. కాని 'రాం' అనిపిలచినా 'రహీం' అనిపిలచినా ఓ అని పలికేవాడు ఒక్క దేవుడని నా విశ్వాసం.

ఖుస్రూ—పోనీ! నన్ను చూచి సహాయం చెయ్ దాదా!

మహా—నా బొందిలో జీవం వుండునంతవరకు ఈ సామ్రాజ్యంలో ఎట్టి అంతఃకలహం తలయెత్తినా నేను సహించను.

ఖుస్రూ—మహాబత్! నీ అధికార ప్రదర్శనం నేనూ సహించను. నీవు వీరాధి వీరుడవే కావచ్చు. యీ మొగలుసామ్రాజ్యాన్ని కంటికి రెప్పగా కాపాడుతున్న ప్రచండ ఖడ్గహస్తుడవే కావచ్చు. కాని నేను ప్రభువును-నీవు సేవకమాత్రుడవు ఇది మొగల్ సామ్రాజ్యం కాని మహాబత్ ఖాన్ సామ్రాజ్యం కాదు.

మహా—పేరు మొగలుసామ్రాజ్యమే కాని ప్రజలంతా భారతీయులే యను విషయం మరవకండి. ఈ సామ్రాజ్యాన్ని [illegible]యుడు పాలింపనీ, హిందువుడు పాలింపనీ, లేక రేపు ఖండాంతర జాతివచ్చి పాలింపనీ, [illegible] ఆదినుండి సుప్రతిష్ఠితంఅయి వున్న సద్ధర్మాలు దూషితంకావో, ఆ ధర్మాలను అనుష్ఠించి పాలించు వంశ కాలం అరాజు విదేశస్థుడైనా, ఎంతటివాడైనా [illegible] పూజించుట భారతీయుని స్వభావం.

ఖుస్రూ—ఆధర్మాలు అతిక్రమించుటచేతనే నా తండ్రి అపరాధి అయ్యాడు.

మహా—ఆ అపరాధాన్ని [illegible] మీరూ అపరాధులు కాబోతున్నారు.

ఖుస్రూ—కాదిది అపరాధంకాదు—ప్రజాహితమైనకార్యం. ఆ మెహరున్నిసా [illegible] నీకు తెలుసు. ఆమెను [illegible]

నాతండ్రి నిదురించుటకల్లా. అనంతరం రాజ్య సర్వస్వం ఆమెచేతికి నప్పగించి తాను శ్యనన డోలికా మాలికలలో పైమరచి నిద్రించుట నిశ్చయం. దాదా ! నీకంటె చిన్నవాణ్ణి కాని నాతండ్రి ప్రకృతి నాకు తెలుసు. భవిష్యత్ చెబుతున్నాను విను ! ఈభారతసామ్రాజ్యం యికనుండి నదుపుకత్తె సామ్రాజ్యం కాబోతుంది.

మహా—కానియ్యండి యువరాజా ! నేటిఖడ్గములు ఆనాడు పొద్దుబోకునా ?

ఖుర్రూ—దాదా ! నీవు యోధుడవేకాని రాజనీతిపరుడవుకావు.

మహా—రాజనీతి !—యువరాజా ! భాషలో అనేక పదాలు మోసగిస్తూ యుంటాయి. రాజనీతి అనే ప్రత్యేకమయిన వింతనీతి ఒకటివున్నదని ఆదిలేకపోతే ఈసామ్రాజ్యాలన్ని పేకముక్కలు పేర్చిన మేడలవలె గుభిల్లున కూలిపోవునని, చిన్ననాటినుంచి మన చెవులలో నూరిపోశారు రాజ్యాంగకర్తలు. కానిరాజ్యము ప్రపంచమే—రాజులు మనుష్యులే—నీతిఒక్కటే—సత్యం—అహింస ! యువరాజా ! అప్పుడప్పుడు కొన్ని ప్రశాంతసమయాల్లో ఒక అశరీరవాక్కు నాచెవులో చెబుతూవుంటుంది. యేమనగా

సీ. రక్తదాహముగొన్న రాకాసి యొక్కటె
మొగలాయి నగరులో మొగమునూప
తండ్రులు, తనయులు, తమ్ములన్నలు దూరం
తద్వేష కంపన దద్దరిల్ల
అన్యోన్య కలహాంపుటగ్గి కొండలు ప్రతి
ధ్వనిత ఘాంకృతుల వక్త్రములు తెరువ
బాబరు నాటి, యక్బరు పెంప, సొంపారి
నట్టి ఈసామ్రాజ్య మగ్గికలియ
భరతఖండంబు డక్కరి పాడువడుచు,
కాచుకొనియున్న దొంగ కుక్కలకునెల్ల
తలుపు తెరిచిన యిలువోలె దారియొసగు
నంచు వినిపించు గగనవాక్యంబు, నీవు
సార్థకము సేయకయ్య ! అనర్థమయ్యె.

(తెర)

## దృశ్యం మూడు

(ఆగ్రామహల్లో-మెహరున్నిసా ప్రవేశం)

మెహె—తుదకు నావిముక్తికి వచ్చింది అనుమతి. కానియిప్పుడెచ్చటికిపోవుదును? తండ్రి యొద్దకా? బర్ద్వాన్‌కా? ఎవరున్నారు?—లేరు. లేకున్నమానె పోవుదును. యీ మహలులో యింక ఒక్కక్షణమైన ఉండతగదు—ఉండకూడదు ఉన్న కొలది నాహృదయమే పరమశత్రువై నన్ను ప్రతిఘటించునేమో! వ్యసనదేవతా నృత్యరంగమయిన యీ అంతఃపురము నాకు దేహదౌర్బల్యాన్నే కాదు, బుద్ధిసాంకర్యాన్నిగూడ సంఘటిస్తుందేమో! ఛీ! కుటిలబుద్ధి—గులామీప్రకృతి! ఔను ఇక ఒక్కక్షణమైన ఇచట నుండతగదు, ఉండరాదు. పోయెదను—దేనికో!-ఎచటికో_ఎట్లో-పోయెదను!

మోతి—(ప్రవేశించి) అమ్మా! సమ్రాజ్ఞి జోధపురీబాయివారు వస్తున్నారు.

మెహె—సమ్రాజ్ఞియా? స్వాగతం అనిచెప్పు!

(మోతీ నిష్క్రమణం, అద్దంలోచూచుకుంటూ మెహర్ తనవేషం దిద్దుకుంటుంది, ఇంతలో జోధపురీబాయి ప్రవేశం. ఆమెకు మెహర్ బందగీ చేస్తుంది. మెహర్‌కు ఆమెకూడ బందగీచేస్తుంది.)

జోధ—మెహరున్నిసా! నీకుఒక శుభవార్తచెప్పటానికి వచ్చాను. కానినీఉత్సాహంచూస్తే ఆవార్తయిదివరకే నీకుతెలిసిందని గ్రహించుకుంటున్నా.

మెహె—ఔను సమ్రాజ్ఞీ. నావిన్నపము ఇన్నాళ్ళకు సఫలమైంది.

జోధ—మెహర్! కన్యాసహితవై ఇకనీఇచ్ఛవచ్చిన చోటికి పోవచ్చు.

మెహె—ఈవార్తను స్వయంగా చెప్పటకు శ్రమఅనుకోకుండా వచ్చిన మీ ఔదార్యానికి నాకృతజ్ఞతను ఏవిధంగా చూపించాలో తెలియకుండావుంది.

జోధ—మెహెర్! ఒకప్రశ్న అడుగవలెనని అనుకొంటున్నా.

మెహె—అవశ్యం.

జోధ—నీకు రాణివి కావలెనని ఉన్నదా?

మెహె—క్షమించండి. నాకు ఏమికావలెననియులేదు. తిన్నగాతిరిగి బర్ద్వాన్‌కు పోవలెనని మాత్రంవుంది.

జోధ—మెహెర్! నీవుకాదలచుకొంటే రాణివి కావటం ఒక్కక్షణం. రాణీ అంటే సామాన్యరాణీకూడా కాదు—రాణీయొంకీ రాణి! భారత్‌కి అధీశ్వరి! ఏపదవి ఇన్నాళ్ళూ నాకు ప్రాప్తమైవుందో ఆపట్టమహిషీత్వం మెహెర్! పదునాలేండ్లక్రితం సమ్రాట్ నీయందు ఎంతప్రేమగానియుండెనో నేనుకూడ అంతేకాదు—అంతకంటె ఎక్కువగాకూడ ఉన్నాడు. అనురాగిట్టు, అతని అఖండసామ్రాజ్యం, రెండూ నీకొంగు

మూడిళ్ళోకి తమంతతామూ నడిచివస్తున్నవి. ముడిచివేసుకుంటావో! పారవేసుకుంటావో! ఆమహత్తరనిర్ణయం నీభ్రుకుటీ విక్షేపమునందలి ఒక్క భంగిమమీద-నీనాల్కకొనయందలి ఒక్కఅక్షరంమీద తేలియాడుతుంది. ఏమిటి ఆలోచిస్తున్నావు ?

మెహె—ఆలోచన ఏమనగా లోకప్రసిద్ధుడైన అట్టిభర్తను, సకలసంపత్కరమైన అటువంటి సామ్రాజ్యాన్ని మీరంతమీరు నావంటి పరస్త్రీకి ఇంత అయాచితంగా ఇంతఅనాయాసంగా, అర్పించుకొనే అసాధారణ ఔదర్యం యెక్కడైనావుందా ?

జోధ—మెహెర్! నేను హిందువును. నాహిందూ జాతి స్త్రీలకు జన్మసాఫల్యం పతిసేవ, పతిభక్తి, పతిఆనందం. అట్టిసమ్రాట్టు, ఇట్టి సామ్రాజ్యాలు, నాతరిచేతిలోవున్నా నాఆశలన్నీయిక్కడ లేవు—అక్కడవున్నవి—చెప్పు ! మెహెర్ ! నీనిర్ణయమేమిటి ?

మెహె—సహీ సమ్రాజ్ఞి ! మైసమ్రాజ్ఞి సహీహోనాచాహతీ.

జోధ—మంచిది. ఇందుబలవంతము ఏమియులేదు. నీ హృదయంలో నన్ను గూర్చి ఏలాంటి సంకోచమూ లేకుండ నా అంతట నేవచ్చి నాహృదయాన్ని నీకువెల్లడించాలంటే ప్రొద్దుపోయింది ఇకనేవెడతా !

(జోధ పురీబాయి నిష్క్రమణం)

మెహె—రాణీయోంకీరాణి ! భారత్ కీ అధీశ్వరి ! ఈ తలంపులో ఏపైశాచిక శక్తియుందో కాని ఆపాదమస్తకంనన్ను భూకంపంవలె వుర్రూతలూగిస్తున్నది. ఛీ ! దారుణదురంతపాతకం !— కాని తేరిపారచూచుకొంటే నాభావిజీవితానికి గమ్యస్థానమేమిటి ? నిష్ఫలరోదనం—నిరంతరదారిద్ర్యం ! —ఛీ ! ఈవిచారణమే యింతఅనర్థానికి కారణం. ఔను వద్దు. మెహెర్ ! నిన్నునీవే మోసగించుకొంటున్నావు ? జాగ్రత! జాగ్రత ! అబ్బా ఈగది ఇంతవేడెక్కిందేం !—వ్ ! (అటూ యిటూ తిరుగుతుంది—లేస్తుంది, కూర్చుంటుంది) ఎక్కడైనా మనుష్యులలోరెండేసి ఆత్మలుంటాయా ? ఉండకపోతే ఇన్నాళ్లు యీఅంతర్యుద్ధందేనికి జరుగుతూంది ! —వ్ ! ఎంత వేడిగా ఉందిక్కడ !—ఛీ ! అట్టిదారుణ అకార్యం నేనుచేయను. నాహృదయాన్ని నిర్దాక్షిణ్యంగా నిగ్రహించుకుంటా ! నాదృఢసంకల్పాన్ని నిరాఘాటంగా పాలించుకుంటా ! ఆ ప్రియనాధుని, ఆ ప్రేమమూర్తిని స్మరించుకుంటూ అతని ప్రతిబింబాన్ని నా లైలా కంటిపాపలో వీక్షించుకుంటూ యీ దుష్ట ప్రపంచానికి దూరంగా తొలగి ఎట్లో ఎక్కడో ఈ జీవితాన్ని కడతేరుస్తా. ఇప్పుడే—ఈక్షణమే—ఈవగలునుండి వ్యసన విషధూమధామమైన ఈగూఢగృహంనుండి, తుచ్ఛసుఖలాలసాదేవతకు జయజయధ్వానములు పఠించే ఈ సౌధశాలనుండి పారిపోతా ! పరుగెత్తుకొనిపోతా ! ఔను ! ఇప్పుడే—ఈక్షణమే—

(మోతి ప్రవేశం)

మోతి—అమ్మా!—అమ్మా!—

మెహ—ఎవరు?—ఏమి?—

మోతి—మీ అన్నగారు ఆసఫ్‌ఖాన్‌జీ వచ్చియున్నారు

మెహ—కౌన్? ఆసఫ్?

మోతి—ఔను.

మెహ—క్యాంఆయా? అచ్ఛా! లేఆకో! (మోతినిష్క్రమణం) (వెంటనే ఆసఫ్ ప్రవేశం)

ఆసఫ్—చెల్లీ! నీసన్నాహం ఒకింతసేపు ఆపి ఒకవార్తవిను.

మెహ—తర్వాతవింటా! ఆసఫ్! నీవురానేవచ్చావు ఒకపల్లకి మాట్లాడిపెట్టు బర్ద్వాన్‌కి—పో.

ఆసఫ్—మెహర్! ఎందుకంత ఆందోళన?

మెహర్—అలాకనిపిస్తున్నానా? మరేమీ తీసుకెళ్ళే—సరే! ఏమిటావార్త? మహారాజుకూడా నన్ను పంపించడానికి ఒప్పాడా? మీ ఇద్దరిలో ఎవరోఒకరు నావెంట వస్తారనే అనుకుంటున్నా.

ఆసఫ్—మెహర్! నేనువచ్చిన పని అదేమీకాదు.

మెహ—మరి?

ఆసఫ్—నీదగ్గరకు సమ్రాట్టు పంపించగావచ్చా. ఆయనఒక్కసారి అయిదునిముషాలపాటు నీదర్శనంకావాలని కోరుతున్నాడు.

మెహ—నాదర్శనం?—దేనికి?

ఆసఫ్—నీకు తెలియదా?

మెహ—అటులైనా!—సరే! ఆయనకు ఆ ఉద్రేకమే యింకనూ ఉన్నయెడల నాసలాములుచెప్పి నన్ను మరీ మరీ క్షమించవలసిందని నావిజ్ఞప్తిగా విన్నవించు.

ఆసఫ్—నీవు వెళ్ళబోయేముందు ఒక్కసారి నీదర్శనమైనా యివ్వకూడదా?

మెహ—నహీం!

ఆసఫ్—మెహర్! షేర్‌ఖాను పరలోకానికిపోయి ఇప్పటికి నాలుగేండ్లుగడిచి పోయాయి ఇస్లాంధర్మానికి స్త్రీ పునర్వివాహం వ్యతిరేకంకాదు. పదునాలుగేండ్ల దీర్ఘకాలంలో అంతటి ఘనమైన దీప ప్రాబల్యమైనా అశాంతకాల గర్భంలో అదృశ్యం అయిపోయినా, ఆ సమ్రాట్టు హృదయంలో నీమీదఅనురాగం అచంచలమైన అనూర్యగోళంవలె అప్పటికీ యిప్పటికీ అదేవిధంగా ప్రజ్వలిస్తున్నది, కాని-నీకే—

మెహ—ఆసఫ్ ! ఆయనహృదయంలో నేనెట్లో, నాహృదయంలో నాస్వామి యుఅట్లే !

ఆసఫ్—కాని, నీస్వామినీకు తిరిగిరాడుకదా—అటిగాక-

మెహ—నీ ఉపదేశం నిష్ఫలం. నాసంకల్పానికి తిరుగులేదు. ఇకనీవు వెళ్ళవచ్చు.

ఆసఫ్—మెహెర్ ! కోటిమంది స్త్రీలలో ఒక్క స్త్రీకికూడ ఇట్టిఅవకాశం లభించుట అసంభవం సుమా !

మెహ—మీరంతాకలసి నన్నునట్టేట దింపుటకు కట్టుకట్టారా? నాకువెట్టిమెత్తిందాకా వదలరా ? ఆసఫ్ ! నీవు ఎందుకువచ్చావు ఇక్కడికి ?

ఆసఫ్—వెళ్లిపోతా! కాని ఒక్కవిషయం—పాదాక్రాంతం కాబోతున్న ఈసంపదను ఈపదవిని ఈ అధికారాన్ని నీవుస్వీకరిస్తే కలుగనున్న సుయోగానికీ, తిరస్కరిస్తే కలుగనున్న దుర్యోగానికీమధ్య ఎంతవిపరీత తారతమ్యంఉన్నదో ఒక్కింత ఊహించుకో.

సీ. కడుపెల్ల వజ్రాల కాన్కగా విలసిల్లు
గోలకొండ, నగలకొండ నీకు
లాహోరుతోట గులాబీలు జిల్కు ప
న్నీటి సోనల నోలలాట నీకు
అల యుధిష్ఠిరు దొట్టి యధిపులు మెట్టిన
మేటిగద్దియనైన చోటునీకు
ముక్తకంఠంబులు ముక్కోటి జనములు
వలుకు కేకేలు, మేల్కొలుపు నీకు
సతత జయశీల నిజభుజసంక్రాంత బంధ
బంధితసమగ్ర హిందూవసుంధరుండు
పతి ! కోనగోటమీటు వూబంతినీకు
సాటియెవరింకనీకు స్త్రీకోటి ? లలన !

మెహ—ఆసఫ్ ! బికారిణినై బిచ్చమెత్తుకోడానికే నిశ్చయించుకున్నా.

ఆసఫ్—అయితే నీతోపాటు మాఅందరికీకూడా అదికారి ఉద్యోగము ప్రాప్తిస్తుంది. ఎందుకంటే నీవుఅంగీకరిస్తే మనతండ్రికి ప్రధాన మంత్రిపదవి ప్రాప్తిస్తుంది. అంగీకరించకపోతే ఉన్న కోశాధ్యక్ష పదవికూడ ఊడ్పాటన అవుతుంది.

మెహె—అర్థమైంది-అసఫ్ ! ఇదిదారుణసమస్య. నాశరీరాన్నీ నాఆత్మనూ నాది అనిచేసి గర్విస్తున్న సౌశీల్య సర్వస్వాన్నీ ఒకసామ్రాజ్య హోమగుండంలో ఏకధారగా ఆహుతిచేయుటా చేయకపోవుటా ?—నాస్వామిని బలిగొన్న ఎవనివిద్రోహ కరవాల ధారవెంట నాహృదయంకూడ రెండుగాచీలి మాయనిగాయంతో నేటికిని మరిగిపోతూ ఉందో వానిగళమునకు కల్యాణ కుసుమ దామం కట్టుటా ?—కట్టకుండుటా!—ఇది కఠోర సమస్య !

అసఫ్—మెహెర్ ! నీశక్తి నీప్రజ్ఞ నీప్రతిభ నీకే తెలియక తప్పుత్రోవలో పోతున్నావు. ప్రకృతి నిన్ను బాజారీ బిచ్చారిణిగా ఉద్దేశించలేదు. కోహినూరు వజ్రఖచితమైన మహోజ్జ్వల భారతకిరీటాన్ని శిరోలంకారంగా ధరించే ఒకలోకోత్తర నారీలలామగా ఉద్దేశించింది !

మెహె—ప్రకృతియో పిశాచమో, ఏదో ఒకటిన్నన్ను 'రా ! రా' అనిఇక్కడికి లాక్కొని వచ్చినట్లే కనబడుతోంది. లేకపోతే—

సీ. ఎన్నడో ఒకనాటి పున్నమ నగ్బరు
సార్వభౌముడు విందు సలుపనేల
సలిపెనుబో ! ఎల్లసభికులముందు నే
సిగ్గరి నృత్యంబు సేయనేల ?
చేసితిబో ! అనైచ్ఛికముగ నాముఖా
చ్ఛాదన ముడివీడి జారనేల ?
జారెబో ! ఆ జహాంగీరు గాంచగనేల ?
కాంచెబో ! వలపున కరుగనేల
కరిగెబో వేండ్లు వ్రాండ్లయ్యు మరువడేల ?
మరువకున్నాడుపో ! నేను మగని వెంట
దివికి పోనైతి నేల ? మైతిపిమ్మట ?
ఇటకురానేల ? రానేల ఇంతలీల !

హా హా హా ! తెలిసింది !—ఇందుకే !—విస్పష్టమైంది !—ఔను !—అపిశాచికే గెలుపు నాకేఓటమి !—ఇకదాచను !—దాచినా అదిదాగదు !—భావానికి రానేవచ్చింది !—కళంకం !—ఇక వాక్కళంకానికి భయపడుటెందుకు ?

అసఫ్—చెల్లీ ! నా కేమీబోధపడుటలేదు.

మెహ — ఇక బోధపడగలదు ! — అసఫ్ ! నీకూ నాయనకూ ఉండే ఏకాభి ప్రాయమూ ?

అసఫ్ — ఏది?

మెహ — నేను సమ్రాజ్ఞి కావడం.

అసఫ్ — ఆం. ఇద్దరికి అదేఅభిప్రాయం ! నీవు సమ్రాజ్ఞివి — నాయన ముఖ్య ప్రధాన్ — నేను ఖజాంచీ.

మెహ — సరే. నీ కోరికను నేనెందుకు కాదనాలి ! — అల్లెయగుగాక ! —

అసఫ్ — ఏమిటీ ! — నిజంగానా ! — నాచెవులతో నిజంగా వింటున్నానా — మళ్ళీఒకసారి చెప్పు ! —

మెహ — కానీ — అసఫ్ ! —

అసఫ్ — ఇక 'కానీ' వద్దు — 'అయితే' వద్దు, నేను సరిగా నే విన్నాలే — నీవు ఒప్పుకున్నావులే — ఇక వెళ్ళివస్తా.

మెహ — ఉండు : ఒక్క మహత్తరవిషయం యిందులో యిమిడివుంది. విను ! వెళ్ళిపోతున్న ఒకఆడపులిని బయటికి లాగిన ఫలితమేమగునో — ఎట్లాగునో — బాధ్యత మాత్రము నాదికాదు —

అసఫ్ — ఇదంతా వట్టిభ్రమ. అనవసర అనుమానం ఫలితాలలో ఏ ప్రమాదమూ రానేరదు ... వస్తే నిర్వహించే బాధ్యతనాది సరేనా !

మెహ — సరే! అబ్ జావో! జాకర్ సమ్రాట్సే కహోకి మై సే వివాహ్ కర్నేకో మై తయ్యార్ హూం.

అసఫ్! — అచ్ఛా బహుత్ అచ్ఛా ! మెహర్ ! నిన్ను మెహర్ అని పిలుచుటకు యిదేకడసారి. ఎందుకంటే నేటినుండి నీపేరు మెహర్ కాదట! 'నూర్జహాన్' అనగా జగజ్జ్యోతియట ! సమ్రాట్ ఆదేశంఇది. నీవు తప్పక అంగీకరిస్తావనే అచంచల విశ్వాసంతో ఆయన ఎన్నెన్నో ఏమేమో సిద్ధంచేయించి తానుకూడావచ్చి అపటాభ్యాం తరమున వేచియున్నాడు — ఇకనాకు సెలవా ? బందగీ నూర్జహాన్ బేగమ్‌సాహెబ్ బందగీ హింద్‌కీ అధీశ్వరీ ! బందగీ భారత్‌కీ సమ్రాజ్ఞీ ! (వెనక్కి తిరిగి) కౌన్ హై ?

బజావో ! బజావో ! భేరీమృదంగ్ ! ఆవో దాస్‌దాసీ ! గావో ! నాచో ! —

(అంటూ అసఫ్ వెళ్ళిపోతూయుండగా నలువైపులనుంచి తూర్యారవాలు వినబడ తాయి. నలుప్రక్కలనుంచి దాసదాసీలు హారాలతో ఆహారాలతో ఉపహారాలతో నృత్యగానాలుచేస్తువచ్చి నూర్జహాన్‌నుచుట్టిఅలంకారంచేయడానికిఆరంభిస్తారు. ఆదేసమయంలో జహంగీర్ ఒకచేతిలో కిరీటం పట్టుకొనివచ్చి నూర్జహాన్ శిరస్సుకుఅలంకరిస్తాడు. వందిమాగధులు ప్రవేశించి ప్రశస్తిచదువుతుంటారు ఇవన్నీ ఏకకాలంలో జరుగుతాయి.)

(తెర)

## అంకం మూడు

### దృ శ్యం ఒ క టి

(ఆగ్రామహాల్లో వీథి-న ర్తకి ఒకతె నృత్యంచేస్తుంటే వందిమాగధులు దానికి వంతపాడుతూ ఆడుతూ ప్రవేశం.)

నృ త్య గీ తం

నర్తకి—ప్రీతమఆవో ! ప్రేమపిలావో !—
ప్రీతకె గీత సునావో !
సైలాసే మహారియూర్‌కో రాత్‌కు షాదీహోనా
ఆజ్ రాత్‌కు షాదీహోనా !

మాగ—ఫిర్, హం క్యాకరనా ?—

వంది—జానా, పీనా, ఖానా, సోనా

మాగ—జానా పీనా ఖానా సోనా ?

వంది—హాఁ

నర్తకి—ప్రీతమఆవో, ప్రేమ—

వంది—నవఉత్సవకా రంగ్ చడానా !

మాగ—నరనారీ సింగార్ బనానా !

నర్తకి—ప్రీమడోలికామే బిఠానా !
ఝూలాకే ఝూలనా ! ఝూలాకే ఝూలనా !
ఝూలాకే ఝూలానా !—
పృథివీనబ్ క్యాహై ?
ఏక్ ప్రేమాకా నికుంజహై
ఉస్‌నికుంజమే క్యాహై ?
ఏక్ కోయిల కూకూకరతీ
ఉస్ గానామృతసె మన్ భర్‌భర్‌కే
దునియా సోజాతీ ! దునియా సోజాతీ !
దునియా సోజాతీ !—

(నర్తకి నృత్యంతో విశ్రమిస్తుంది.)

బంది—మాగధ్ ! హెుక్టి రోజూనికీ హేమ్టి చెప్పాం? గ్యాపక్ వుంటా ? "వచ్చిం దీరే వచ్చింది ! తురుష్క రాజ్యం తుడుచుకుపోయే తుపాను వచ్చింది !"

మాగ—హేమ్టి హైందీరె! తెలాకు షహారియాన్కు ఫెల్లి హైంది. ఇస్మే తుపాన్ క్యాహై ?

బంది—అరే ! గుడ్లగూబకీబేటా ! హింట్కీ షమాచార్ నీకీ తెల్వారె ?

మాగ—క్యా షమాచార్ !

బంది—రే ! ఖుస్రూసాబ్ ఖూనీహువారె ! ఖూని ! ఖూని !

మాగ—(ఉలికిపడి) క్యా అ అ అ అ—

బంది—హాఁ-ఖుస్రూసాబ్ ఖూనీహువా !—

మాగ—ఖుస్రూసాబ్ ఖూనీ !— కోన్ కియా, కిదర్ కియా ? ఓఖుస్రూసాబ్ తమ్ముడు షాజహాన్ తోకల్సి ఉదయపూర్ మీద యుద్ధాన్కి పోయాడ్ అని హిన్నాం.

బంది—హాఁ హక్కా అర్ధరాత్రి ఢేరాలో నిద్రపోతూవుంటే, నిద్దర్లోనే హైందీరె పెద్దనిద్ర !

మాగ—కోన్ కియారె ఏఖూనీ ?

బంది—(రహస్యంగా) ఔర్ కోన్ హై ? షాజహాన్ !—

మాగ—(రహస్యంగా) షాజహాన్ ! హాన్నాగొంతూ కొయ్యడాన్కి హాడ్కీ షేతుల్ కైసావచ్చిందీరే !

బంది—హాడ్కీ స్వయంగ సెయ్యలేదురే.

మాగ—ఫిర్ క్యారె ?

బంది—ఓబద్మాష్ గ్రాంషింహాంవుండాడే హాడ్కీ ద్వారా సేయించాడ్ రె !

మాగ—గ్రాంషింహాం! (ఆలోచనతో తలపంకిస్తూ చిటికెలు వేస్తూ) హాఁ హద్దీ! మాకీ తెల్సింది ! హద్దీ !

బంది - క్యారే ?

మాగ—(కడురహస్యంగా) ఈఖూనీసేసింది షాజహాన్ వాడు కాదురే కాకా,

బంది—ఫిర్ కోన్ ?

మాగ—(కడురహస్యంగా) నూర్జహాన్ !

బంది—క్యా అఅఅఅ !—

మాగ—హాఁ నూర్జహాన్ హెుక్టిరోజూ ఓ గ్రాంషింహాన్కి బులాకే, దర్వాజా బంద్ కే, పూ రా ఆదాఘంటాతక్ హాడ్కీతో గుస్ గుసా గుస్ గుసా సేస్తూవుంటే హున్కి ఫెళ్ళాం జొతీబాయ్ నూనీ మాకీ సెప్పింది. హాదేరోజ్ ఓగ్రాంషింహాం ఉదేపూర్ చలే గయా !

వంది—క్యా ! ఓ గ్రాంథికంహాంతో ఓ పతివ్రతాత్యాగ్‌తో నూర్జహాఁ గుస్‌గుసా కియా !- బాప్రే- ! ఉండు ! ఉండు ! మాకీహోక్తి పాలోచనా వచ్చింది- ! రే ! మాగధ్ ! ఘుట్టిగా ఫటోక్కమాకీ !

మాగ—క్యా ఆలోచనా ?

వంది—(రహస్యంగా) ఓనూర్జహాఁ, షైతాన్ బన్‌గయీహై షైతాఁ ! దాన్కి పుంది రెండు మేకల్ బలి ముందటిమేక ఖుస్రూ - రెండోమేక షాజహాఁ.

మాగ—ఫిర్ షహరియార్ క్యాహోనా ?

వంది—హువ్వా రాజ్యాన్కి హుక్కుదార్ షహరియార్-అంటే లైలా అన్నమాట- అంటే నూర్జహాఁ అన్నమాటే !

మాగ—సచ్ హైరే సచ్ హై !

వంది—లేకపోతే-లైలాకీనూరు పతుసైన్య త్రిశూల క్యాక్కొనూరు. పసలేని ఫత్తి, మరి ఖత్తికి ఫత్తికి కల్పిందీహంటే ఓనూర్జహాన్ సేసింది షైతాఁకా కుట్ర!— (తెరవంక చూస్తూ) ఉంహు ! కౌన్ హై ! రే ! దేఖో ! మన్కి ఫెళ్ళాం మోతీబాయి దౌడ్ దౌడ్ కర్కే ఆతీహై - క్యాహువారే ! బాబా ! క్యాహువా !—

(మోతీ ఆయాసంతో పరుగిడుతూవచ్చి మాగధుణ్ణి చేయిపట్టుకొని)

మోతీ—రా ! ఆగ్రానుంచి పారిపోదాం ! రా ! ఇక్కడుండవద్దు ! రా !

మాగ—క్యాహువా ?

వంది—క్యాహువా ?

మోతీ—ఇంకామీకు తెలియదా! ఆగ్రాను ముట్టడించి జహాంగీరునూ నూర్జహాఁనూ పట్టి ఖైదుచేయడానికి షాజహాన్ పెద్దసైన్యంతో వస్తున్నాడు. అతణ్ణి ఓడించటానికి, పర్విజ్, మహాబత్‌ఖాన్ని పంపించాడు. పెద్ద యుద్ధం కాబోతుంది! రండి ! ఎవరి ప్రాణాలువారు దక్కించుకుందాం ! రండి !

మాగ—రే ! షాజహాన్ జెండా యెత్తాడురే యెత్తాడు !

వంది—మగర్ మోతీబాయ్! షాజహాఁ హైంక్యూంయెత్తాడు జెండా ?

మోతీ—ఎందుకేమిటి ! ఖుస్రూను చంపించి షాజహానేనని అన్నగారు అయ్యగార్కి బాగాబోధచేసి నమ్మించింది. వెంటనేఆవెర్రి మహారాజా షాజహాఁను ఖైదుచేసితీసుకురమ్మని అక్కడఉన్న మరో సేనానాయకునికి రహస్యంగా ఆజ్ఞ పంపించారు. అది ముందుగానే తెలుసుకొని షాజహాఁ ఒళ్లుమండిపోయి ఇలా లాభంలేదని పూర్తిగా ధ్వజమెత్తి తానేసమర్థుడనని కూడా ఢంకావేయించి ఆగ్రామీదికి దండెత్తివస్తున్నాడు

వంది—(సగం సంగీతమాలో) "రక్తికివచ్చిందిబాయీ ఈ రాజ్యాన్కి నాటకం

రంగైన నాటకం—రక్తికెవచ్చింది" (అంటూగంతులు వేస్తారు)

మాగ—మగర్ బందీభాయ్ ! హాప్డా మనం హొక్కడ్కి పోవాలా ?

బంది—అరే ! మనం హొక్కడ్కి పోవాలి ? హొందూస్కు పోవాలి ? బట్టాజా అక్నికి బయంహొందుస్కు ! హొవదురాజాహైతే వాడ్కి జండా పట్టి వాడ్కి పాట పాడదాం !

మాగ—ఠీక్ హైరే ! ఠీక్ ! నీకీఆలోచన బడీ వుంది.

బంది—(నవ్వుతూ) హాఁ దేఖో మోతీభాయ్ ! మాకీబుద్ధివుంది ఓ బుర్రవాన్ని తీకా బుధ్దీ !—మగర్ హిహిహి !—మీ కీమీదనికీ—

మాగ—రే ! హల్గా హిఁ కొట్టీదఫా హన్నాపుఅంటే మాకీ ఒళ్లుఅంతా శరీరం హైపోతాది !—కపడ్ దార్ !

బంది—తుంబోలో మోతీబాయ్ ! కౌన్ కపడ్ దార్ ! హై ? ఉనో ? హొకీ నకీప్పైపే హాడిమాకీ ఖరార్ !

మోతీ—చెప్పనా ? వాడు బూడిదలోదొర్లె గాడిద ! నీవు కొండలునాకే కుక్కవు !—అంతేకాదు మీపురుషజాతి అంతాసిగ్గులేనిజాతే !

(తెర)

# అంకం నాలుగు

## రంగం ఒకటి

కాశ్మీరదేశంలో—సింధునదీతీరమైన విశాల ఒడ్డున నూర్జహాన్ జహంగీర్ల యొక్కయు పరివారంయొక్కయు డేరాలు వేయబడియున్నవి. డేరాలకు దూరంగా కథక వేషాలతో వందిమాగధులూ మోతీయూ ప్రవేశము. పాట.

వంది-మాగ }
మోతి } అ అ అ అ అ అ అ అ హాజీ సునోజీ !

**మోతి**— మా రాజాలాటి రాజా లేడట, రాణీలాటి రాణీ లేదట—

వంది-మాగ—మోతీలాటి ముత్యం లేదట—

మోతీ—(వందిమాగధుల జేసి వేలుచూపిస్తూ) ఇద్దర్ నోటికి సుద్దీ లేదట

ముగ్గురూ—అ అ అ అ అ అ అ అ హాజీ సునోజీ !

మోతీ— జహాంగీరు పాదుషాకు మొన్నను జ్వరం తగిలెనండీ
మహారాణి నూర్జహాను గారికి దిగుల్ కలిగెనండీ
స్థలాంతరానికి పొమ్మని వైద్యులు హితంచెప్పిరండీ
అదే ప్రకారం ఈ కాశ్మీరం అంతా వచ్చామండీ—

ముగ్గురూ—అ అ అ అ అ అ అ అ అ హాజీ సునోజీ !

మోతీ—షాజహాను చూస్తే మళ్లీ మేవాడుకు పరారునుండీ
యోధమహాబ్బతు అగాధయోచన అదేమో తెలియదండీ
ఏక్షణమందున ఏమిజరుగునో అగమ్యగోచరమండీ
ఇదిఅంతా యోచిస్తే గుండెలు గభేలు గుభేలు మండీ—

ముగ్గురూ—అ అ అ అ అ అ అ అ హాజీ సునోజీ !

మోతీ—షాజహానుదే రాజ్యంహక్కని జహాంగీరు నుండీ
షహర్యారుదే రాజ్యంహక్కని సామ్రాజ్ఞీ నుండీ
ఎవ్వరి పంతము జయించునోయని ఏల యడుగుటండీ
మగవాడింటే మగువచేతిలో మట్టిముద్ద నుండీ.

వంది— క్యా ! క్యా ! మోతీబాయ్ ! హాడ్వాడ్ సేతిలో మగవాడ్ పుట్టినాడ్డ? మరి ఖుడ్వా పాంత ఘుమ్మీకాయ్ కత్తిపీటకు లోక్యా - పాడి తెల్యానీకీ ?

మాగ— రేభాయీ ! రాణీ నూదల్ దాసీనాకా పెంకీవుందిరే స్త్రీ సామ్రాజ్యం చుప్పే బాబా చుప్ !

వంది— మవ్ క్యాంరేగి చుప్కే జహాంగీర్ నాయుహా ఫక్కా మీంది ధబ్కా లిస్నాడ్ అకే-ఖుద్రాలేకపోతే ఘూర్రేభీకరుస్తాడి-మాలుం ?

మోతీ - మీ కాకులం ఏమంటుంటేయేం ? మా కోకిలలకు లోపమూ ?

వంది— సైసై మోతీబాయ్ ! సౌన్నాయి వాక్యం హెంతా మన్నికంగావున్నా షక్కా ఢోలు దెబ్బలేకపోతే ఢీలా హైతాది - మాలుం ?

(సంగ్రాంసింహుడు ప్రవేశిస్తూ)

సంగ్రాం— ఔను! సంకీ! ఢోలు సన్నాయిలకు స్తేనే సక్తి. ఇన్నాళ్లూ సమ్రాజ్ఞి నూర్జహానుగారి సన్నాయికి అంటలేనే ఆరక్కే. ఇకయిప్పుడు వస్తున్నాడు సిద్ధహస్తుడైనవాద్యగాడు. మ్రోగబోతుంది మహోచ్ఛ్రైనఢోలు ! ఢోల ఊఢోలగాదు—దిగ్దంతి శ్రవణపుటభేదన ప్రచండమైన దేశాఢోలు ! అదిగో ! అదిగో ! నరికిఅవలిగట్టున దూర దూరంగా బ్రహ్మాండమైనదుమారం ఒకటి కన్నుమిన్ను కప్పేసి కదంతొక్కుతూ ఇటేవస్తున్నది చూడండి ! చూడండి !

మోతీ— ........ఔనుసుమా ! ఏమిటది ?

వంది— .........క్యాహైవో ?

మాగ— .........క్యాహైరేబాబా !

మోతీ— .........సుడిగాలి ! సుడిగాలి !

వంది— సుడిగాలి కాదురేభాయీ ! సైన్యంలాగావుందిరే సైన్యం !

మాగ— బాప్రే ! కిస్కా సైన్యంరే ! క్యోఆతారే ! క్యాకర్నారే !

మోతీ— సంగ్రాంజీ ! భయంవేస్తున్నది చెప్పండి ఎవరిదాసైన్యం ! శత్రువులదా మిత్రులదా !

సంగ్రాం— రెండూను.

మోతీ— అంటే ?

సంగ్రాం— శత్రురూపంగా వస్తున్న మిత్రుడిది.

వంది— హాం ! తెల్సిందిరే తెల్సింది. (సగంరాగంతో) వస్తున్నాడు మహాబత్ ఖాన్ ! వస్తాడు మహాబత్ ఖాన్ !

మోతీ— అమ్మయొయ్యో ! మహాబత్ ఖానా ! సమ్రాజ్ఞిమీద కత్తికట్టాడా ! సైన్య

సహితంగా వస్తున్నాడా ? ఎంత స్వామిద్రోహం ! ఎంతదౌర్జన్యం ! వందీ ! పోయి మహారాజాళ్ళతో చెప్పు! మాగధ్ ! నీవుపోయి సేనాపతి ఎక్కడున్నాడో వెతికి సమ్రాట్టు వద్దకుతీసుకురా ! నేనుముందుగాపోయి సమ్రాజ్ఞికి సమ్రాట్టుకు ఈవార్త చెప్పి సమర సన్నాహంచేయిస్తా. ఊ ! నడవండి !—

(ముగ్గురు నిష్క్రమణం)

సంగ్రాం— ఈ భట్రాజుపందలట ! సమరసన్నాహమట ! హా హ్హా హ్హా — అదుగో ! ప్రళయవాహినిలాగ మహాబత్ ఖాన్ సైన్యం ముంచుకొని వస్తున్నది. అది తెలియక సమ్రాజ్ఞి సమ్రాట్లు చిదానందసాగరంలో చిందులాడుతూ శిబిరంలోపడి వున్నారు. డేరాలకు కాపలావచ్చిన సైన్యంకూడా స్వల్పసంఖ్యాకం, అదైనా కత్తులన్నీ కడగా పెట్టి గంజాయికైపుతో కమ్మగా నిద్రపోతున్నది. కాబట్టి సమ్రాజ్ఞీ సమ్రాట్లు మహాబత్ ఖానుకు ఖైదీలగుట నిశ్చయం. దానితో మొగల్ నిష్క్రమణం హిందూపునః ప్రవేశం నిర్ధారం. కాబట్టి, ఇకనుండి గాలివాటాన్నిగుర్తించి తెరచాపను తిప్పుకోకపోతే మనడింగీ ఉనికికొట్టటం నిస్సందేహం. అందుచేత ఇకఒక్కటే మనకు కర్తవ్యం. (అంటూ కత్తి దూసి) జయహో మహాబత్ ఖాన్ ! జయహో హిందూస్థాన్ ! హర్ హర్ మహాదేవ్ !—

(నిష్క్రమణం)

## రంగం రెండు

విపాశానది ఒడ్డున సమ్రాట్ శిబిరంలో నృత్యం జరుగుతూ వుంది, నృత్యం నడుమ జహాంగీరుని వెంట పెట్టుకొని నూర్జహాన్ ప్రవేశం. జహాంగీరు చాలా బలహీనంగానే వున్నాడు. అయినా ఆబలహీనతను ధిక్కరించి అతని ఆనందం యథావిధిగా ఉబుకుతూనేవుంది. ఆసనంలో కూర్చొని ఒకనిమిష కాలం నృత్యం ఆనందిస్తుంటాడు. మధువుఅందిస్తూ నూర్జహాను పరిచర్య చేస్తూవుంటుంది. ఇంతలో షహర్యారుప్రవేశం. మధువు అనుచూ జహాంగీరు అతనిని గమనించలేదు. షహర్యారు నూర్జహాను వంకచూస్తాడు. ఆమె చిరునవ్వునవ్వి తలవూపుతుంది. షహర్యారుకు తన్నుపిలిపించిన పనియేమో అర్థంకాకపోయినా, ధైర్యం వచ్చింది.

షహ—సమ్రాట్ !బందగీ !

జహా—హో షహర్యార్ ?

షహ—నాకు కబురు పంపించారా ?

జహా—హాఁ,బేటా !—ప్రియతమా! ఇంకాక నేనుప్రాపిన ఆశర్మ్యకారెక్కడ? బేటా ! బైటో జువాఁ. (షహర్యారు మరోఆసనం మీదకూర్చుంటాడు. ఇంతలో మేజా

మీదవున్న ఒకరత్నపేటికలోనుంచి ఒకకాగితంతీసి నూర్జహాను జహాంగీరుకు అందిస్తూ నృత్యం ఆపమని నర్తకీలకు సైగచేస్తుంది.) షహార్యార్ ! నీ అగ్రసోదరుడు ఖుస్రూ నాకంటేముందే వెళ్లిపోయాడు నీరెండో అన్న షాజహానుకు, నేతలున్నా లేనట్టుగానే విని పిస్తున్నా. నీమూడో అన్న పర్వేజుకు జనానా ప్రపంచమేగాని జనప్రపంచం కనిపించుటలేదు. ఇక నన్నూ నా సామ్రాజ్యాన్నీ అనుసరించుకొని ఉన్నవాడవు నీవే కనపడుతున్నావు. కాబట్టి భావి భారత సమ్రాట్ పదవికి నీవే పాత్రుడవని వ్రాసిలోంచింది. ఇదిగో ఫర్మానా ! షహార్యార్ ! అందుకో ! రా యిటు !

షహా — (లేచి నూర్జహానువంక చూస్తాడు. ఆ చిరునవ్వుతో కలవపూపుతుంది. ముందుకువచ్చి ఫర్మానాఅందుకొని బందగీ చేస్తాడు ఇంతలో లైలా ప్రవేశం. అందరూ తెల్లబోతారు.)

లైలా — రాజకుమారా ! ఈకాగితంయేమిటి ? (షహార్యార్ చేతిలోని ఫర్మానా లాక్కొని చదువుకుంటుంది.) సమ్రాజ్ఞీ ! షహార్యారును అడ్డంపెట్టి ఇలాటి తెర చాటునాటకం ఆడవలసినంత అధోగతికి పాలైనావెందుకు ? ఈఫర్మానా నీవేనాడే వ్రాయించుకుంటే ఎవరుకాదన్నారు ?— రాజకుమారా ! ఈసామ్రాజ్య సుడిగుండంలో ఒకఅన్నగారు పూర్తిగా అంతర్థానమై పోయారు. మరొక అన్నగారు ప్రమాదకరంగా దానిలోంచి బయటపడి భ్రమణం చేస్తున్నారు ఈ యిద్దరి దుర్గతి యిట్లాగా మీరుకూడా దూకుతున్నారెందుకు ? సమ్రాట్ ! ఈఫర్మానా మీరు త్రికరణశుద్ధిగా వ్రాసిందికాదు. నాకుతెలుసు ఇదంతా ఆ పిచ్చివాణ్ణి ఆడించుటకై మీరుచేస్తున్న అగాధ గూఢకుటిల తంత్రం. సమ్రాజ్ఞీ ! ఈఫర్మానాను నీచేతిలోని ఆషాజహానుతో నీవే యుద్ధంచేసి సామ్రాజ్యాన్ని నిలువబెట్టుకో ! (అంటూ ఆఫర్మానాను నూర్జహాను మీదికి విసిరిపారేస్తుంది). రాజకుమారా ! సుగుణమానవుడవు సుగుణవానవుడవు కాని వాడు సమ్రాట్ పదవికి అనర్హుడు. రండు. (అంటూ షహార్యార్‌తో నిష్క్రమణం)

జహా — (బిగ్గరగ నవ్వుతూ) హా హా హా (అంటూ మధువు అందుతూ) నర్తకీయో ! నాచో ! నాచో !

(నృత్యం ఆరంభం)

నూర్జ — వృథా ! ప్రయత్నమంతా వృథా !

(మోతీ పరుగెత్తుకు వస్తుంది. దాని వైఖరి చాలా భీభత్సంగా వుంటుంది. నృత్యం ఆగిపోతుంది)

మోతీ — అమ్మా ! అమ్మా !

నూర్జ — ఏమే ! ఏమిజరిగింది ?

మోతీ—మహబత్ ఖాను పెద్ద సైన్యంతో మనమీదికి యుద్ధానికి వస్తున్నారు-యుద్ధానికి !

నూర్జ—మహబత్ ఖానా !

వంది—(పరుగెత్తుకుంటూ ప్రవేశించి) ఖుదావంద్ ! హోషియార్ ! హోషియార్ !

మాగ—(పరుగెత్తుకుంటూ ప్రవేశించి) జహాఁపనా ! జాగో ! జాగో !

వంది—ఖుదావంద్! మనకు జరిగింది మహాద్రోహం. హిందూస్థానంటే మనకు కావలావున్న మన రజపుత్ సైన్యంకూడా రాజద్రోహం తల్పి ఏకోదం పరారీఅయి మహబత్ ఖాన్ సైన్యంతో మిలాకాత్ హైంది.

మాగ—మనరజపూత్ సైన్యాన్ని హిందీద్రోహం బోధచేసింది ఓమహారాణా జాదా గాంధిసింగ్

మోతీ—అమ్మా ! అమ్మా ! మాయింటి అయ్యగారి ప్రాణం మీప్రాణం రక్షించుకోండి ! రండి ! రండి !

నూర్జ—నోరుమూయ్! దాసీ! నీదాసబుద్ధి నీకేఉపయోగించుకో! పోయి నారణముగను సిద్ధంచేయించు, నేనే స్వయంగా నాయకత్వం వహించానని సర్వసైన్యానికీ తెలియజెప్పు. ఆరజపూత్ పాపిసలు పోయినమానె- మన మొగల్ సైనికులు మూడువేలమంది వున్నారు. ఆద్రోహిమహాబత్తును శిక్షించుటకు ఆ సైన్యమేచాలును. పో! (మోతీనిష్క్రమణం) వంది ! మాగధ్ ! మీరాజభక్తికి చాలా ప్రశంసిస్తున్నాను. మీరిద్దరు ఇక్కడనేవుండి సమ్రాట్టుకు పరిచర్యచేయండి. సమ్రాట్ ! జంగ్ మైదాన్ జానేకా ఆజ్ఞా దీజియే.

జహా—(ఇంతవరకు జహాంగీరు తనహావభావాలను తనలోనే దాచుకున్నాడు) సమ్రాజ్ఞీ ! కానున్నది దారుణయుద్ధం. శత్రువో వీరమహాబత్. నీవు అబలవు. రణరంగానికిపోవుట చాలాప్రమాదకరం సుమా.

నూర్జ—[illegible] ! [illegible] ! [illegible] అబలలు కారు స్త్రీలు.

సీ. సకలజగజ్జాల సంవర్ధమాన శ
క్తిస్వరూపిణులు మా స్త్రీలుగారె ?
పూజ్యసంసార సామ్రాజ్యసింహాసన
స్థితచక్రవర్తినుల్ స్త్రీలుగారె ?

ప్రేమమహాయజ్ఞ హోమకుండార్పిత
స్వీయసర్వస్వలు స్త్రీలు గారె ?
కుల సంఘ మత దేశ గౌరవరక్షణ
దీక్షానిబద్ధలు స్త్రీలుగారె ?
ధీరులన్ గన్న మాతలు స్త్రీలుగారె ?
జాలమింకేల ? చండప్రచండ ఖడ్గ
ధారిణీ మాలిణీ ధాటి పోరుసలిపి
రిపులశిక్షింతు-లేదా ! వరింతు మృతిని !—

(కత్తిదూసి నిష్క్రమణం)

(వెలుపల రణదుందుభులు, ఫిరంగిమోతలు తీవ్రమైన రణసంరంభం)

వంది—ఖుదావంద్ ! హమ్మగార్కి ఏం ప్రమాదం వస్తుందో అని నాకే గడ్ బడ్ గ్యాబా హైతాది.

మాగ—జహాఁపనా ! మేంకూడా హమ్మగారివెంట పోతాం ఆజ్ఞా దీజియే. (జహాంగీరు తలూపడు.) (రహస్యంగా వందితో) క్యారే ! సమ్రాట్ ఏకదం చుప్ హోగయా. దివానా బన్‌గయాక్యా ?

వంది—(రహస్యంగా) దివానా నైరే. పూరాదిమాగ్ హై. హిందీవాంతా నన్నీ నన్నీ నాటక్ రే.

(ఖడ్గహస్తుడై మహబత్‌ఖాన్ ప్రవేశం. వెంట రణసింహుడుకూడా ఉన్నాడు.)

మహ—(నేపథ్యంవంక చూస్తూ) రాజపుత్రసైనికులారా ! చాలు! ఇక ఆపండి రక్తపాతం. రణసింగ్ ! నీవుపోయి యుద్ధవిరామానికి సన్నాహంచేసి, ముఖ్యంగా ఆ ఖైదీ తున్న డేరాచెలుపల పారాయిస్తూ నాఆజ్ఞకోసం యెదురుచూస్తూవుండు.

(రణసింగు నిష్క్రమణం)

మహ—సమ్రాట్ ! సేవకుని సలాములు.

జహా—నర్తకీయోం! మహబత్‌ఖానో స్వాగత్ గావో ! నాచో !

మహ—(నర్తకులను పొమ్మని సంజ్ఞచేస్తూ) ప్రభూ ! నాట్యప్రదర్శన సవినోదంకోసం రాలేదు నేను. (నర్తకులు పారిపోతారు.)

జహా—మరి ?

మహ—ఇంకోవిధంగా మీదర్శనం అలభ్యమని ఈవిధంగా లభింపజేసుకున్నా.

జహా—కొండతిసంగతి—సమ్రాజ్ఞికి క్షేమమా ?

మహా—క్షేమమే.

జహా—ఆమెకు ఏహానియూ కలిగింపవలదని విశ్వాసంచేశాను, నేను ఆటంకం చెప్పలేదు. ఆమె ఎక్కడున్నది ?

మహా—నాపరివార రక్షణలోనే ఉన్నారు.

జహా—ఖైదీగానా ?

మహా—ఔను.

జహా—నేనుకూడా నీ ఖైదీనా ?

మహా—జహాఁపనా ! మహాబత్ ఖానుని బంధించే సంకల్పం ఈ మొంగల్ సామ్రాజ్యంలో ఇంకా తయారుకాలేదని ఆనాడు మీకు తెలివిచ్చాను. ఆ దివ్యవాక్యం నాచెవులలో ఇంకా మారుమ్రోగుతూంది.

జహా—మరి నీరాకకు హేతువు ?

మహా—మీ మనశ్శాంతు కాపాడటానికే. జహాఁపనా ! మీరు భారత సమ్రాట్టులు. మహాత్మ అక్బరుపుత్రులు. కాని మీ పరిపాలన స్వైరిణీవిహారంవల్ల, ఉన్మత్తుని ప్రలాపంవల్ల, అస్థిరమై అపహాస్యకారకమై అంతకంతకు అతిక్రాంత ధార్మికమై అఖండ భారతవర్షమునకు అపఖ్యాతను కలిగించుచున్నది. జహాఁపనా—

జహా—మహాబత్ ! నన్ను నేను సమర్థించుకోడానికి యత్నం చేయను. ఎందుకంటే నా లోపాలు నీకంటే నాకే బాగా తెలుసు.

మహా—ప్రభూ ! గతాన్ని గూర్చి నిష్ఠురోక్తులాడుటకు నేను రాలేదు. ప్రస్తుతాన్ని గూర్చి మీవల్ల న్యాయం పొందుటకు వచ్చా.

జహా—మంచిది. నీకేమి న్యాయం కావాలి ? ఎవరిమీద నీ అభియోగం ?

మహా—నా అభియోగం భారత సమ్రాజ్ఞియైన నూర్జహాఁ బేగంమీద.

జహా—అసంగతి మాకిదివరకే బోధపడింది. సరే-నీ అభియోగం ఏమని ?

మహా—మొదటి అభియోగం ఏమనగా—సంగ్రామసింహునిద్వారా సమ్రాజ్ఞి ఖుస్రూను హత్యచేయించింది. ఆ హత్యఫలితంగా పూజ్యురాలైన జోధపురీబాయి పుత్రశోకంతో మరణించింది.

జహా—హా అరే బేచార్ ఖుస్రూ ! అభాగినీ జోధపురీ !

మహా—ఆ సుచేష్టిత ఈ దారుణహత్యానేరమును పాదుషాకు ఆరోపించింది అంతేకాక మీకూ నడుమ విరోధం కల్పించి నన్ను రాజద్రోహియనుటకు కారణం కలిగించింది.

జహా—ఇంతేనా ?

మహా—మరొకటి. మీ అధికారమును తాను స్వీకరించి మీ నామమాత్రపు మొంగల్ రాజవంశ ప్రతిష్ఠను మాయనిమచ్చ ఘటింపజేయగల నిరంకుశంగా వర్తించింది.

ప్రభూ ! ఈమూడు అభియోగాలలో ఏఒకటి అసత్యమైనాసరే సమ్రాజ్ఞిని మీరుశిక్షింప నక్కరలేదు—

జహా—సత్యమైనమేడలు ?

మహా—శిక్షింపక తప్పదు.

జహా—(మౌనం)

మహా—నాఅభియోగములు మూడును సత్యమేయని అంగీకరిస్తారా ?

జహా—(మౌనం)

మహా—కాబట్టి సత్యములేయని మీరంగీకరించినట్లే.

జహా—మహాబత్ ఖాన్ !—

మహా—ఈ మూడింటిలో ఒక్కొక్క అపరాధానికి దండన—మరణం !

జహా—సునో మహాబత్ ఖాన్ !—

మహా—సమ్రాట్ ! నేనువాదిని మీరు న్యాయాధీశులు. న్యాయమే కావు కావాలి. న్యాయవిచారమే మీరమలుపరచాలి.

జహా—(మౌనం)

మహా—ఈ అపరాధాలకు మరణమేయోగ్యదండనమని మీరంగీకరిస్తారా? లేదా?

జహా—ఔను.

మహా—అటులైన సమ్రాజ్ఞికి మృత్యుదండన విధించే ఆజ్ఞా పత్రం ఇదిగో. దీనిపై సంతకం చేయండి.

జహా—మహాబత్ !—

మహా—నహీ సమ్రాట్ ! నహీసోచ్నా-నహీడర్నా-నహీ ధర్మఘాత్ కర్నా.

జహా—లో-భీ-మహాబత్ !—

మహా—జహాఁపనా ! ఆప్ కౌన్ హై? రాజధర్మ్ కా విరాట్ స్వరూప్ హై! దుష్టోం కో శిక్షణ్, శిష్టోం కో రక్షణ్ ఆప్కా కర్తవ్య హై. మాతాపితా భార్యా బహెన్ ఇత్యాది మమతా బిల్ కుల్ ఛోడ్కే ధర్మరక్షణ్ కా కామ్ మే ఇన్సాఫ్ సే. ఇమాన్సే దో కుచ్ కర్నా ఆవశ్య హై సబ్ కర్నా హై. సమ్రాట్ ! దీజియే దండనా ! కీజియే దస్తఖత్—(మహాబత్ ఆజ్ఞాపత్రం అందిస్తాడు మరుమాటచెప్పకుండా జహాంగీరు సంతకం చేస్తాడు.)

మహా—రణసింగ్......... (రణసింగు ప్రవేశం)—ఈ పత్రాన్ని గొంపోయి మన శిబిరంలో వున్న సమ్రాజ్ఞికిచూపించి ఆజ్ఞనెరవేర్చు. (రణసింగు నిష్క్రమణం) ...... భారత సమ్రాట్టుల న్యాయవిచార మిట్లుగదా ఉండవలెను ? ప్రభూ ? నిష్పక్షపాతంగా న్యాయంవిచారించుటలో జహాంగీరువంటి సమ్రాట్టు నభూతో నభవిష్యతి అనియావద్భారతం కీర్తించినందుకు నేడు ఆకీర్తికి అచంచలమైన ఉపాధియేర్పడింది.

(రణసింగు ప్రవేశం)

రణ—మరణించుటకుముందు ఒక్కసారి సమ్రాట్ దర్శనం కావాలని సమ్రాజ్ఞి అర్థిస్తున్నది.

జహాఁ—(మహాబత్‌ఖాను వంక చూస్తాడు)

మహా—సమ్రాట్ దర్శనమెందుకు ! పోయి అడిగిరా.

(రణసింగు నిష్క్రమణం)

మహా—జహాఁపనా ! సమ్రాజ్ఞి మీసన్నిధికివచ్చి ఏవిధంగా మాట్లాడి మీమనస్సును మళ్ళీఎలా మారుస్తుందో మీరుమాత్రంవెనుకటి ప్రేమాభిమానాలు విస్మరించి న్యాయ విచారమందే బద్ధమనస్కులై యుందురుగాకయని సేవకుని హెచ్చరిక.

(రణసింగు ప్రవేశం)

రణ—మరణించుటకుముందు పతిని దర్శించుట పతివ్రతాధర్మమని సమ్రాజ్ఞి సెలవిచ్చారు.

మహా—మంచిది. తీసుకురా.

(రణసింగు నిష్క్రమణం)

మహా—జహాఁపనా ! ధైర్యం ! తాను చేసిన ధర్మశాసనాన్ని తామే నిర్వ్యాజంగా పాలించకపోతే ధర్మదేవత నిజంగా దిక్కుమాలినదై పోతుంది.

(రణసింగు వెంట నూర్జహాను ప్రవేశం)

నూర్జ—ప్రభూ ! ఈ సంతకంమీదేనా ?

జహాఁ—(మౌనం)

నూర్జ—అర్థమైంది. మొదటసందేహించా. ఇప్పుడునివారణ అయింది. ప్రభూ ! నేనుస్వప్రాణరక్షణకోసం ప్రార్థించుటకురాలేదు. ఎందుకంటే రానున్నమరణానికి నేనుజంకను. తానుమనసారప్రేమించిన పురుషుడు తనమీదికి కత్తి నాయుకూలంఘించినప్పుడు నిజమైనప్రియురాలు ఆకత్తికోతనే కంఠమాలగాస్వీకరిస్తుంది. జహాఁపనా ! నాకుమరణ దండన విధించుచున్న ఈ ఆజ్ఞాపత్రంమీద ఏనీతితో మీరు సంతకంచేశారో ఆచేతిని ఒక్కసారికన్నుల కద్దుకొనిచ్చి ఆనందంగానన్నుచంపండి (అంటూ జహాంగీరుచేయిపట్టు కొని కన్నులకద్దుకొనుటేగాక ముద్దుపెట్టుకుంటుంది).

జహాఁ—నూర్జహాన్ ! ఆసంతకం నాదికాదుసుమా.

నూర్జ—మీదికాదా ! మరెవరిది ?

జహాఁ—నూర్జహాన్ ! నీవుఎన్నోఅపరాధాలు చేశావు—నేనేమీఅనలేదు. నేను ఎక్కువగా ప్రేమించినఖుర్రమును హత్యచేయించావు—సహించిఊరుకున్నా. [illegible] [illegible] చాలించిండి—సహించిఊరుకున్నా. అఖండసామ్రాజ్యం [illegible]

## రంగం మూడు

అగ్రాకోటలో ఒకవీధి. సంగ్రాంసింగు ప్రవేశం.

సంగ్రాం — ఛీ! ఛీ! ఛీ! — మహాబత్తు ఇంతపిరికిపంద అవుతాడని కలలో కూడా అనుకోలేదు.

సీ. రానేల దండెత్తి రజపూతసేనతో
బ్రహ్మాండ సమరసంరంభ మొసఁగ?
వచ్చెంబో-భారత ప్రభ్వియా యానూర్జ
హానును ఖైదు సేయంగ నేల?
చేసెంబో-తచ్ఛిరశ్ఛేదనమున కాజ్ఞఁ
ప్రభు జహాంగీరుచేఁ బడయ నేల?
బడసెంబో-తుదకు తద్బాష్పాంబుపూరాన
కరఁగి కర్తవ్యంబు మరువనేల?
ఉష్ణరుధిర స్రవంతులనోలలాడి
నట్టి మహాబత్తు కటకటా! తుట్టతుదకు
ముగుదకన్నీటి వరదలో మునుక వేసె! —
స్త్రీ, యబలయన్న కవి కేలసిగ్గు లేదు!

అనద, అసమర్థుడు, అప్రయోజకుడు! తేలిపోయింది. మహాబత్! నీకు గాజుల్ల—వలెనేద! నీవీరత్వం పట్టినదిబీరకాయ! అయ్యయ్యో! ఎటువంటి అపూర్వతరుణం! చివరకు ఎంత అవహాస్యం! —

శా. ఆనిర్భాగ్యవిధాతబుద్ధి యెటుబుగ్గైపోయెనో గాని, యి
స్త్రీ! నేనే మహాబత్తునైనయెడ వేరేచెప్పనేలా? పరా
ధీనత్వంబును ద్రోచి, హిందువులశక్తిన్ బెంచి, స్వాతంత్ర్యఢం
కానాదంబు దిగంతరాంతరగ పరిక్రాంతంబుగాఁ జేయనే? —

అబ్రహ్మ పట్టి యంబ్రహ్మ. వానిసృష్టికి అర్థంలేదు;

గీ. బుద్ధియున్నచోట భుజబలంబుండదు;
యుక్తియున్నచోట శక్తిసున్న;
రెండునొక్కచోట నుండుట కూర్వదు
"బమ్మ, వానికేమి దిమ్మతెగులా?"! —

మహాబత్ ఖానుచేత చావకుండ ఆనాడు జహాంగీరును తప్పించింది ఆబ్రహ్మయే. ఆజహాంగీరునే మళ్లీ ఇప్పుడు మూడు నెలలనుండీ మన్యజ్వరంతో మంచంపట్టించింది ఆబ్రహ్మయే. అతనిదృష్టిలో మహాబత్ఖానుకంటే మన్యజ్వరం ప్రశస్తమని తోచిందా ? అదుగో ! రాచనగరంతా వైద్యులమయమైపోయింది. పాలతెలుపు పాగడీలా-పసుపుపచ్చ హకీములు చామనచాయ భిషక్కులూ-చూస్తే సమ్రాట్ జహాంగీరు మాపో రేపో స్వర్గయాత్రకు బయలుదేరేట్లే కనబడుతుంది. దానితో ఒకవంక సమ్రాజ్ఞీషహర్యార్లు, ఒకవంక షాజహాన్ మహాబత్ఖాన్లూ ఒకరిమీద ఒకరు ఢంకాకొట్టుకిస్తారు. ఆరెండు పక్షాలలో మనదే పక్షమో ? !—తీవ్రంగా ఆలోచించాలి. (పోబోయి నేపథ్యంవంకచెవి ఆనించివింటూ) అదుగో ! అదుగో ! రోదోంతరాళం నిండిపోయేటట్లు రోదనధ్వని ఆరంభమైందిరాచనగరులో. (మళ్లీశ్రద్ధగావింటూ) హారహారా ! హరిహారా ! చలేగయా. సమ్రాట్ జహాంగీర్ చలేగయా. ఏక్దం ఊపర్ ఉడ్గయా. అచ్ఛా సమ్రాట్కీ ఆఖరీదర్శన్ కర్నే జావుంగా.

(నిష్క్రమణం)

## రంగం నాలుగు

శూన్యదర్బారు మంటపం. శూన్యసింహాసనం. సర్వం శూన్యం. తలవిరియబోసుకొని దీనవ్యరూపంతో ప్రవేశం నూర్జహాన్. వెంట మోతీకూడావుంది —

నూర్జ—(అన్నివైపులా తేరిపారచూస్తుంది. శూన్యం. నిశ్శబ్దం.) హాయిరే ! హోగయా ! దర్బార్ హోగయా స్మశాన్ ! సింహాసన్ మే బైటాహై శూన్యీరాజా ! జగత్కా జ్యోతి జహాంగీర్ మిట్గయా ! గయా మేరీఆశా ! గయా మేరీశోభా ! గయా మేరీస్వప్న !

మోతి—అమ్మా ! మీరేఇలా అధైర్యపడితే, యిక మాబోటి ఆశ్రితులగతి ఏమి కావాలి ? తల్లీ ! ధైర్యం తెచ్చుకోండి !—ధైర్యం !

నూర్జ—ధైర్యం !—నేను ధైర్యంతోనే వున్నా ! భర్తృమరణానికి నాకనులు వేడిఅశ్రువులు రాల్చాయా ?? లేదు _ నాహృదయం శతధా భిన్నభిన్నమైందా ! లేదు—నాతనువు మొదలునరికిన మ్రానువలె నేలవ్రాలిందా ?—లేదు ! - నిజం - ! ఔను - నాదేనుమీ ధైర్యం. కాని మోతీ !— నాధైర్యాన్నిచూస్తే నాకే ఎందుకో భయం కలుగుతున్నది.

మోతి—ఎందుకు తల్లీ !

నూర్జ—ఇంతటి ధైర్యం స్త్రీజాతికి అసహజమేమో !

మోతి—అమ్మా !

నూర్జ—ఇక—నేను స్త్రీని కానా ?

మోతి—ఎంతమాట !

(వంది ప్రవేశించి బందగీచేసి మౌనంగా ఉంటాడు.)

నూర్జ—వంది ! నాకుసంబంధించిన ఏదోఒక దుర్వార్త అభాగ్యరేఖ నీముఖం మీద స్ఫుటతరమై కనిపిస్తున్నది. చెప్పు!—ఎట్టి ఘోరవార్త వినడానికైనా ధైర్యంవుంది ! చెప్పు !—

వంది—ఖుదావంద్ ! మహబత్ ఖాన్ గారి సహాయంతో షాజహాన్ సాహెబ్ గారు పెద్దఫౌజుతో వచ్చి షహర్ ఖిల్లాను ముట్టడిచేసి బడాజోర్ సే యుద్ధం షురూకియా.

మాగ—(ప్రవేశించి బందగీచేసి) ఖుదావంద్! మీఅన్న ఆసఫ్ గారుభీ, షాజహాన్ పక్షంలోచేరి మనకీ మీద దాడి చేస్తున్నార్.

నూర్జ—ఆసఫ్ కూడా !

మాగ—జీ, హాఁ ! అజ్ఞాదీజియే !

నూర్జ—అచ్ఛా ! తుంలోగ్ జావ్ ! జాకర్ సబ్ ఖాజీలోంకో, సబ్ సేనాపతియోంకో బోలో, షాజహాన్ సే యుద్ధ్ కర్నా ! సామ్రాజ్య రక్షకర్నా ! జావ్.

(వంది మాగధులు నిష్క్రమణం)

నూర్జ—మోతీ ! నీవుపోయి షహర్యారును వెంటనే పంపించు.

(మోతి నిష్క్రమణం)

నూర్జ—(చేతులు వెనక్కి కట్టుకొని నిర్జనయోచనలో అటూఇటూ పచారుచేస్తూ) భారతాధీశ్వరీ ! నీవింకనూ సజీవురాలవై యున్నావా? ప్రపంచము నాచివ్రపోయిందా? లేదు !—కాని నీశక్తి నిరుపయోగమైపోయింది. ప్రపంచం ... నిశ్చయం. అందుచేతనే, నీశత్రుబృందం యింతసర్వసులభంగా, ఇంత నిరాఘాటంగా విజృంభించింది ! హా హా హా ! రాణియోంకీ రాణీ !—

మ. కొనగోటన్ పువుబంతివోలె భరతక్షోణిన్ దుటారించిమీం
టినసీపైఁ బడవచ్చునన్నవసయుడే ! ఢిల్లీశ్వరీ ! చూడు ! త
త్కనదుత్తుంగతరంగమూర్తి... జయసూర్యాంబే ప్రపద్యంతువో !
వనితల్ దుర్బలలన్న నానుడిమి నిజంబై దానిలోమగ్గదో !

షహ—(ప్రవేశించి బందగీచేసి) సమ్రాజ్ఞీ ! నన్నుపిలిపించిన కారణం ?

నూర్జ—షహర్యార్ ! మీనాయనగారు ఒక మరణశాసనంవ్రాసి నాకుయిచ్చారు. ఆ శాసన ప్రకారం ఈభారతవర్షానికి ఇకనీవే సమ్రాట్టువు !

షహ—నేనా ! సమ్రాట్టు !

నూర్జ—కాని, నీతండ్రిగారి ఆశయానికి విరుద్ధంగా నీఅన్న షాజహాను ఈసింహాసనం కోసంవచ్చాడు.

షహా—రాకుండునా మరి ?

నూర్జ— మన సైన్యాన్ని, మన సేనా నాయకులను యుద్ధానికి పంపించాను. సమ్రాట్టువు కాబట్టి, నీవు సర్వసైన్యాధిపత్యం వహించి సంగ్రామం చేసి, షాజహానును నిర్జించి సింహాసనాన్ని రక్షించుకో -

షహా—యుద్ధమా ! నేను !

నూర్జ—మారుమాట చెప్పవద్దు ! వెళ్లు ! సత్వరం (వెలుపల రణభేరి నినాదం) వహ్ సునో షాజహాఁకా రణభేరీ సునో ! జావ్! అభీ జావ్ ! ఉస్ ద్రోహీ దుష్మనోంకో మారో ! ఖూబ్ మారో !—

షహా—సమ్రాజ్ఞీ ! ఇది మీ నిశ్చితాభిప్రాయమా !

నూర్జ—ఔను.

షహా—నేను నా అన్నతో యుద్ధం చెయ్యక తప్పదా ?

నూర్జ—తప్పదు. వెళ్లు-సత్వరం !

షహా—సరే, లైలా అంగీకారం కూడా తీసుకొని వెడతా.

నూర్జ—లైలా అంగీకారమా ? సమ్రాజ్ఞిని నేనుగాని లైలా కాదు.

షహా—పోనీ-ఆమెను ఒక్కసారి చూచి వెడతా.

నూర్జ—అందుకు మా యాజ్ఞ లేదు.

(మళ్లీ రణభేరీ వినాదం)

షహా—ఆమెను మళ్లీ చూస్తానో లేదో ?

నూర్జ—అధీరుడా ! శత్రుధంకానాదం చెవిని పడినంతనే కదం తొక్కుతూ కదన రంగానికి లంఘించుటమాని జనానాలో కూర్చొని సల్లాపాలు చేస్తానంటావా !

షహా—సమ్రాజ్ఞీ ! లైలా నాతో ఏమి చెప్పిందో మీకు తెలియునా !

నూర్జ—నేను వినదలచుకోలేదు.

షహా—"మా అమ్మను ఏకో ఒక రాక్షసి ఆవేశించింది అందువేత ఆమె ఏ మానవ కృత్యం చేయబోయినా చివరకది రాక్షసకృత్యంగా తయారవుతుంది" అని చెప్పింది.

నూర్జ—అది ఒక అజ్ఞురాలు—నీవొక అపాత్రుడవు.

షహా—సరే—మీకు కోపం వద్దు. తెలిసీ తెలియక ఏమేమో భాషించా, క్షమించండి. ఇక యుద్ధానికే వెడతా. సమ్రాజ్ఞీ ! సెలవు. (పోతూ) లైలా ! నిన్ను మళ్లీ చూస్తానో లేదో ? (నిష్క్రమణం)

నూర్జ— (పోతూవున్న షహార్యారువంక చూపు నిగిడ్చి నిట్టూర్పు విడుస్తూ)

కావమాస్తే ఓడు. వదిమాస్తే పోతు. తరుణోపాయం ! అయోమయం— —హాయిరే నూర్జహాన్ ! నీకథ ఎంతలో ఎలామారిపోయింది ! — ఎంతలో ! —

సీ: దప్పికొంటివికదా తతమహారాజ్యాధి
కార సుధాపాన కాంక్ష మరగి
జాయవైతివికదా జగదేకమండితా
ఖండల భారతమండలునకు
అనుభవించితికదా అఖిలజగత్తులో
ననితరస్త్రీలభ్య మగు విభవము
వెలయించితివికదా విశ్వగోళమునందు
యుగయుగంబులనిల్చియుండు కీర్తి

ఆట్టినీకథ యెంతలో పట్టువిడిచె !
పతికిమక్షణంబు—సుతకు నీపై శతంబు
అల్లు డనద—నేన యనాథ—అరుల బాధ !
భళిరె ! ఏమాయె నీప్రజ్ఞ, భరతరాజ్ఞి !

మోతి— (ప్రవేశిస్తూ) అమ్మా ! రాజకుమారుణ్ణి యుద్ధానికి పంపించారా ?
నూర్జ—పంపించా !
మోతి—అయ్యయ్యో !
నూర్జ— ......నోరుమూయ్ !
మోతి—బాగా యోచించే పంపారా ?
నూర్జ—(ఉలికిపడి) ఏమన్నావే ?
మోతి—బాగా యోచించే పంపారా అని.

నూర్జ—అంటే—నేను ఉన్మత్తురాలనైతిననేవార నీవరకూ వచ్చిందా ?

మోతి—తల్లీ ! ఏఒక్కరిక్షేమంమీద మీమాతాపుత్రికల భావిజీవితమంతా ఆధారపడివుందో, ఆ ఒక్కరినీ ఇంతఅనాలోచితంగా—అంత అపాయకరమైన ఘట్టంలోకి పంపించుట అంత శ్రేయస్కరం కాదని నాచిన్నబుద్ధికి తోచింది.

నూర్—దాసీ !—

మోతి—నేను దాసీనే. కాని యజమానురాలి శ్రేయస్సుకోసం స్వప్రాణం అర్పించడానికైనా సిద్ధపడి ఇంతనిర్భయంగా మాట్లాడుతున్నా ! అమ్మా ! మహారాజ్ఞిగారిని

సంగ్రామరంగంనుంచి వెంటనే పిలిపించండి! మీ క్షేమంకోసమే! మీ అభ్యుదయంకోసమే చెబుతున్నా—

నూర్—(మోతీ పూర్వోక్త సంభాషణ చేస్తూవుండగానే నూర్జహాన్ ఒక కాగడాను వెతికిపట్టుకొనివస్తుంది ఆ కాగడాతో మోతీని కొడుతూ) దాసీ! బానిస! బాంది! గులాం! సమ్రాజ్ఞికి సలహా చెప్పేటంత సాహసం వచ్చిందా నీకు?—నీకు!—నీకు—నీకు! (అంటూ కొట్టి మోతీని తరిమివేసి, కోపఘూర్ణిత మైన ఆ విత్తావస్థలో చిందులు త్రొక్కుతూ) లైలా మొదలు దాసీవరకు నన్ను వెఱ్ఱిదానిని చేసి గేలికి ఆరంభించారు! — నాకు వెఱ్ఱి లేదు! లేదు! లేదు!—ఇది దర్బార్!—నేను సమ్రాజ్ఞిని!—నా పేరు నూర్జహాన్! నూర్—జహాన్—మూడక్షరాలు!—నిశ్చయం!—హి హి హి!—నాకట! వెఱ్ఱియట! వెఱ్ఱి!—

(లైలా ప్రవేశం)

లైలా—సమ్రాజ్ఞీ! నీకు నిజంగా వెఱ్ఱెత్తింది. నీవు వెఱ్ఱెత్తిన ఆడుపులివి

నూర్—లైలా! (ఉద్రేకం పెరిగి ఉబికివస్తున్నది. రక్కసపట్టుతో దాన్ని నిగ్రహించుకొంటూ) లైలా! నీకు కూడా నేను ఆ ఆకారినయ్యానా?

లైలా—నా భర్తను యెందుకు పంపించావు యుద్ధానికి?

నూర్—యుద్ధం లేని రాచరికం పృథ్విలో అభావపదార్థం కదా లైలా!

లైలా—మా భార్యాభర్తలకు అవసరంలేని యీ యుద్ధవ్యాసంగం నీకెందుకు?

నూర్—మీకెందుకు అవసరంలేక పోయింది?

లైలా—అన్యాయం ఎల్లప్పుడు అనవసరమే!

నూర్—అన్యాయం! నీనోటివెంట—ఈనాటికి—ఇట్టిమాట!—లైలా! తల్లి యెడల ద్రోహమా!

లైలా—ద్రోహమా! నేను? నీ యెడల?

నూర్—కాదా మరి? మొగల్ రాజవంశ నిర్మూలనం చేయడానికి ఆనాడు నా చేత శపథం చేయించావు. నన్ను పిశాచినిగమ్మని ప్రేరేపించావు. నాకు చేదోడు వాదోడుగా వుంటానని వాగ్దానం చేశావు. ఇప్పుడు ఇదంతా అనవసరమనీ-అన్యాయమనీ అంటున్నావు. న్యాయమా లైలా!

లైలా—ఔను. ఆనాడు అన్నా. నిజమే. కాని—పిశాచకృత్యం అంటే ఇంత భీకరంగా—ఇంత జుగుప్సాకరంగా ఉండగలదనే ఊహ నాకప్పుడు తోచలేదు.

నూర్—మరి—ఇప్పుడు తోచినా ఇక ఫలితం లేదు.

లైలా—లేదా?—ఏం?

నూర్ — పాత్రధారణ పరిసమాప్తం కావచ్చింది. జీవిత ఖేలనం చిట్టచివరి ఘట్టంలోకి ప్రవేశించింది.

లైలా — అంటే — నాపహరియారునుకూడా —

నూర్జ — ఔను. ఏ పైశాచికబుద్ధిని నీవు నాయందు ప్రేరేపించావో, ఆ బుద్ధియే పంపించింది నీభర్తను యుద్ధరంగానికి. మరి — ఫలితం ఎట్లుంటుందో ! — నేను ఏమానవ కృత్యంచేసినా చివరకు అది రాక్షసకృత్యంగా తయారవుతుందని నీవే అన్నావటకదా ?

లైలా — ఔను. అందులో బద్ధమేమివుంది ?

నూర్జ — కాబట్టి — షహార్యారు విషయంలోమాత్రం అబద్ధమెందుకవుతుంది?

లైలా — అంటే ? నాభర్తకు హానిరాగలదని తెలిసిపంపించావా యుద్ధానికి ?

నూర్జ — నీభర్తకు హానివస్తే నీకేమి లైలా?

లైలా — (తెల్లబోతుంది) అమ్మా ! అమ్మా ! నీమాటలు నీవైఖరి నాకేమో అనిర్వాచ్యమైన భయోత్పాతం కలిగిస్తున్నవి.

నూర్జ — బాలికా ! నీసంకల్పం — నాసంకల్పం — ఘోర ప్రతీకారం ? దారుణ ప్రతిహింస ! మరచితివా ? నీతండ్రి వధకు — నాషేర్ ఖాను హత్యకు — ప్రతిహత్య ! రుధిరాశ్రుపూరం ! హా హా రవాలు ! అనంతవిశ్వ విశ్వంభరాప్రతిధ్వనిత రోదన ధ్వాన పరంపరలు!

లైలా — (వణికిపోతూ) అమ్మా! అమ్మా ! — వద్దు ! — ఇకవద్దు ! విస్మరించు పూర్వగాధ ! నిగ్రహించు నీ క్రోధం ! అమ్మా ! —

నూర్జ — అసంభవం !

లైలా — నాకోసం ! నాకోసం ! అమ్మా !

నూర్జ — నీకోసం ? నీకోసం ? — ఎవరునీవు ? — నాకుతెలియదు ! పో ! — నా ఆవేశ్యానికి ఈ లోకంలో నాకు ఒక్కరూలేరు ! పో — పో ! —

లైలా — (అమాంతంగా తల్లిని గట్టిగా కౌగిలించుకొని మా ! మా ! మా ! అంటూ ఏడుస్తుంది.)

నూర్జ — సహీ ! మైతుమ్హారీ మా నహీహూం ! మైనూర్జహాఁహూం!

లైలా — నహీ ! మా ! తుంమేరీ మాహో ! మేరీ మా మెహర్ ! మేరీ మా మెహరున్నిసా!

నూర్జ — ...... మెహెర్ ! ... మెహెర్ !

లైలా — హాఁ ! మైతుమ్హారీ బేటీహుఁ — అభాగినిలైలాహూం .

నూర్జ — మెహెర్ ! - లైలాకీ మా...

లైలా—అమ్మా! అమ్మా! నీవు నేనే దుర్బోధ చేశాను. నిన్ను నేనే రెచ్చగొట్టాను. తప్పునాదే. తెలుసుకున్నా. కాని అమ్మా! పనిదాన్ని. లోకానుభవంలేదు. నాకు షహర్యారును భర్తగావిధించావు. అతణ్ణి మొదటమొదట గాఢంగా ద్వేషించా. కాని ఆయన యందుగల ఏదో ఒక అస్పష్టమానసిక సౌందర్యం నన్ను మాలిమి చేసుకొంది. క్రమంగా ఆయనయందు అగాధ ప్రేమను అలవరించింది. అమ్మా! ఇప్పుడు నేను స్త్రీని—ప్రేమిని—అబలను! ఆయనలేకపోతే ఇప్పుడు నాకు జగమేలేదు. అమ్మా! నాషహర్యారును నాప్రేమమూర్తిని మళ్లీ నాకళ్లకు చూపించు — వెంటనే యుద్ధరంగంనుంచి ఆయన్ని పిలిపించు. అమ్మా!

నూర్—ఎవరక్కడ?

(మోతీ ప్రవేశం)

నూర్—మోతీ! శరవేగంగల అశ్వాన్ని అధిరోహించి, వాయువేగంతో షహర్యారును కలుసుకొని మనోవేగంతో ఇక్కడికితీసుకురా! ఊఁ! దౌడ్! నీకుగొప్ప బహుమానం.

(మోతీ నిష్క్రమణం)

నూర్—లైలా! మేరీప్రాణ్! మేరీసర్వస్వ! ఆనంద్ రహో! తుమ్హారీ స్వామీ తుంకో మిలేగా! అవశ్య మిలేగా

లైలా—మిలేగా? మిలేగా? మేరీస్వామీ మేరీప్రేమ్ కా దేవతా మిలేగా? హాహా! ఆనంద్! ఆనంద్!

(ఆనందంతో కూనిరాగం పాడుతుండగా "అమ్మా! అమ్మా!" అంటూ మోతీప్రవేశం. దానిపిలుపూ దానిముఖభావమూ చూడగానే లైలాపాట లైలాగొంతుకలోనే ఆగిపోతుంది)

నూర్జ—ఏమే.
లైలా—ఏమిజరిగింది?
నూర్జ—మోతీ!-
లైలా—ఏదీ నాపతి?
నూర్జ—మాట్లాడు_
లైలా—మోతీ_
మోతీ—హత్యజరిగిందమ్మా!—హత్య-
లైలా—హత్య!-
నూర్—ఎవరు? ఎవరిని?

మోతీ—సంగ్రామసింహుడు_షహర్యారును-హ-త్య—

నూర్—సంగ్రామసింహుడు షహర్యారునా ?

లైలా—షహర్యారునా ?-నాషహర్యారునా !--హత్య ?

మోతీ—యుద్ధానికిపోతూవుంటే-- సంగ్రామసింహుడు -- వెనుకనుండివచ్చి--అయ్యగారిని పిస్తోలుతో పేల్చి--చంపివేశాడట ! వందిమాగధులు ఆయనను మోసుకొని వస్తున్నారు ! అదుగో !

(వందిమాగధులు షహర్యారును మోసుకొనివచ్చి దింపుతారు.
షహర్యారు ఒంటినిండారక్తమే. ఇంకాకొనవూపిరివుంది.)

లైలా—హాయిరే ! మేరేస్వామీ ! (అంటూఅతనిమీద పడిపోతుంది)

షహ—లైలా ! నన్నుచంపిన సంగ్రామసింహుణ్ణి — నేనుతిరిగి — చంపలేక పోయినా—వాణ్ణి—పట్టుకొని— పెనగులాడి — చివరకు ఈఆయుధంలాక్కొని—తీసుకువచ్చా ! — చూడు ! (అంటూ పిస్తోలును లైలాకుయిస్తూ) లైలా ! నేను నీ వనుకొన్నంత—అసమర్థుణ్ణను—కానునుమా ! (నవ్వుతూ)—వెలత్ర ! లైలా !_సెలవు !

(మెడ వాలిపోతుంది. మరణం.)

లైలా—(షహర్యారును తేరిపారజూస్తూ) గయా ! గయా ! మర్గయా ! మేరేస్వామీ ! మేరేదేవతా ! — అచ్ఛా ! అబ్ క్యాకర్నా ? — క్యాకర్నా ? (పిస్తలుకేసి ఏకదృష్టితో చూస్తూ) హహహ ! — క్యాకర్నా ! — మర్నా ! — మర్నా ! (పిస్తలు తనకేసి గురిపెట్టుకుంటుంది)

నూర్జ—లైలా ! లైలా ! —

లైలా—మర్నా ! (పేల్చుకొని షహర్యారుమీదపడి చచ్చిపోతుంది.)

నూర్జ—లైలా ! — లైలా ! — లైలా (అంటూ లైలామీదపడి దేహమంతా తడివి చూస్తుంది.) గయా ! లైలాభీగయీ ! సమాప్త్ ! సమాప్త్ ! (లైలాచేతిలోవున్న పిస్తలు తీసుకుంటుంది) సమాప్త్ ? సమాప్త్ హెనేకో అభీ ఏక్ హత్యా బాకీహై ! ఆత్మహత్యా ! సంగ్రాం ! ఏబంమాక్ తుమ్హారీహై ఔర్ అచ్ఛీమారీ హై !— (పిస్తోలు తనగుండెలకు గురిపెట్టుకుని) మేరే షేర్ ఖాన్‌కో, షహర్యారోంకో, లైలాకో, జైసాతుమ్ మార్‌దియా వైసామారేఖుభీ మారో ! (పిస్తలు పేలదు.) మారో ! (రెండవ సారికూడా పేలదు. దానిలో గుండ్లు అయిపోయినవి.) మారో ! తుం నారీ నహీహై క్యా ?—హి హి హి — తూ అచ్ఛీ మారీహై ! మగర్ తుంకో ఐడీమారీ హైహాయ్ ! ఇస్‌లియే డర్ డర్ హోకే తుమ్ తుమ్హారీకామ్ బిల్‌కుల్ భూల్‌గయా ! అచ్ఛా !

ఏకామ్ తుంసే నహీ హోసకోగే తో, హైతుమ్హారీ మాలిక్ కా పాస్ జావుంగీ ! ఉన్సే అవశ్యహోగా! జావ్ తుం! (వికటిపారేస్తుంది) సంగ్రాం ! సంగ్రాం ! కహాంహో తుం ? కహాంహో !— ఆవో ! ఆవో ! హై అకేలీహుం !ఆవో ! మగర్ - దేఖో ! తుమ్హారీ తుపాలీబందూక్, మేరే ప్రియజనోంకేప్రాణ్ ఖా ఖాకే పేట్ భర్ కే ఏక్ దమ్ సోగయా! సున్ లియా ! లావో ! దూస్రాబందూక్ ! దూస్రా నహీహైతో, లావోలాఠీ ! లావోపత్తర్ ! లావోకుఛ్ ! లావో ! మారోమారో ! మారో !— మారో !

(అంటూ పోతూవుండగా ఒక స్తంభానికి మొగం కొట్టుకొని నెత్తురు పారుతుంది.)

(తెర)

## రంగం ఐదు

కోటవెలుపలి ప్రాకారంవద్ద రణమైదానంలో ఒకదృశ్యం

(ఖడ్గహస్తులైన ఆసఫ్‌ఖాను, షాజహాను ప్రవేశం.)

ఆసఫ్—రాజకుమారా ! కోటలోపలి క్రొత్తవార్తలువిన్నారా ?

షాజ—ఏమది !

ఆసఫ్—సమ్రాజ్ఞి నూర్జహానుకు పిచ్చియెత్తినదట !

షాజ—పిచ్చి ! సమ్రాజ్ఞీకా ?

ఆసఫ్—సంగ్రామసింహుడు షహార్యారును హత్యచేశాడట !

షాజ—షహార్యారునా ! హాయిరే మేరేబద్ నసీబ్ భాయీ !

ఆసఫ్—షహార్యారుమరణానికి సహింపలేక లైలా ఆత్మహత్యచేసుకుందట ! అందుచేత సమ్రాజ్ఞికి గతిపోయింది, కాబట్టి మతికూడా పోయివుంటుంది!—

షాజ—ఎంతటి దుర్వార్త—

(అంటూవుండగా మహాబత్‌ఖాను ఖడ్గహస్తుడై కతిపయపరివారంతో ప్రవేశం)

మహా—భారత్ సమ్రాట్ షాజహాన్కీ జయ్‌హో ?

అందఱు—భారత్ సమ్రాట్ షాజహాన్కీ జయ్‌హో !

మహా—జహాఁపనా ! సంగ్రామం పరిసమాప్తమైంది. హతశేషమైన శత్రుసైన్యం మనశరణుజొచ్చింది. విజయలక్ష్మి పూర్తిగా కైవసమైంది. ఇకదుర్గప్రవేశం, సింహాసనారోహణం, మిగిలియున్నవి.

అందరూ—భారత్ సమ్రాట్ షాజహాన్కీ జయ్‌హో !

(అంటూవుండగా వచ్చినబత్తిదూడవలె సంగ్రామ సింహుని కర్రకుర్రేలాడ గట్టి మోసుకొని ప్రవేశం వందిమాగదులు. సంగ్రామసింహునిదింపుతారు. కట్లువిప్పుతారు, దుమ్ము దులుపుకుంటూ సంగ్రామసింహుడు లేచినిలబడతాడు)

వంది—బందగీజహాఁపనా ! షహర్యార్ సాబ్కా ఖూనీసేసింది, ఈహరాంజాదా!

మాగ—హిడ్డీకా పట్వాలిఅని బడీఖుషీసేశాం జహాఁపనా !

వంది—హొల్కా కోసం ఫిల్లిలాగ హిత్కా హిత్కా బేజార్ హుయ్యాం జహాఁపనా!

మాగ—అఖేర్కా హోట్కిజాగాలో వాసనాపట్టాం జహాఁపనా !

వంది—సల్గాసల్గా హొన్కా హొన్కా చేరి మూరెండు తలపాగాల్ కల్పి, లాడులాగ సేని ఏక్ దమ్ హిసిరిరేసి, హాడ్కీ కాళ్లురెండు గట్టిగాబిగించాం జహాఁపనా !

మాగ—హడ్డీదున్నాలాగా హోంద్రు హోంద్రుకర్కే ఏక్దం నేలామీద బోర్లపడ్డాడ్ జహాఁపనా !

వంది—హప్డూర్సుట్న హీపూమీద హొక్కి మూతిమీదఖొట్టి ముక్కూ నేలరాసి కాళ్లుగీళ్లు సేతుల్ గితుల్ పక్కడ్‌సే బందోబస్త్‌కర్కే సచ్చిపోయిన బఱ్ఱెమూడాలాగా ఈ లక్డీకి ఖట్టితెచ్చి హుజూర్ కే సామ్నే హాజర్ చేశాం జహాఁపనా!

మహా—అమూల్యమైన మీ సేవకు మాప్రశంస.

వంది } బందగీ
మాగ }

షాజ—సంగ్రాం ! షహర్యారుయెడల అరాత్మన కృత్యం చేసింది నీవేనా ?

సంగ్రాం—నేనే జహాఁపనా !

షాజ—ఎందుకు చేశావు ?

సంగ్రాం—మీకోసమే జహాఁపనా.

షాజ—సంగ్రాం ? ! —

సంగ్రాం—ఔను. మీకూ మీ సింహాసనానికిమధ్య ఎన్నటికీ ఏ అంతరాయమూ రాకుండా మార్గంలోవున్న ముండ్లన్నిటిని ఏరి తేరి పెకలించి పారేశాను జహాఁపనా.

షాజ—మరికొన్ని ఘోరాలుకూడా చేసితివాయేమి ?

సంగ్రాం—మీయన్న ఖుస్రూగార్కి ఇద్దరు కొడుకులున్నారుకదా జహాఁపనా! ఆయిద్దరినీ ఇంతకుముందే సఫాచేసివచ్చాను. మీతమ్ముడు పర్వేజుగారికి మరొక యిద్దరు కొడుకులున్నారు—వారినికూడా నిశ్శేషం చేశాను జహాఁపనా ! మీ తోవలో ఇక వుంచిక పుల్లకూడాలేదు—సాఫ్ ! బిల్‌కుల్ సాఫ్ !

షాజ— అరరే ! కైసా భయానక్ హత్యాపరంపరా ! కైసా పిశాచ్ కా భీభత్స వర్తనా ! సంగ్రాం ! —

సంగ్రాం— జహాఁపనా !

షాజ— నేనింకా నమ్మజాలను. ఈ కార్యాలన్నీ నీవు నిజంగా చేశావా ?

సంగ్రాం— నా ప్రభువుకు నే చేసిన అమూల్యసేవను తప్పిపుచ్చుకోవాలనివుంటే కష్టం. నాకేమి వచ్చింది జహాఁపనా !

షాజ— తుచ్ఛుడా! నీవు చేసిన యీహత్యలన్నిటినీ ఆమోదించి, హర్షించి, నిన్ను బహుమానింపగలనని ఊహించితివా ? —— నీవుమానవుడవు కావు ! దానవుడవు! సంగ్రాం! ఈ లోకంలోగల శిక్షలలో నీకేది అర్హమో నాకు స్ఫురించుటలేదు. మంచిది. వందీ ! మాగధ్ ! ఏ పిస్తోల్ లేజావ్ ! ఇస్ పాపీకో బాహర్ లేజాకే గోలీసే మార్ దో !

(వంది పిస్తోలును అందుకుంటాడు)
(వందిమాగధులు చెరొకచెయ్యి పట్టుకొని సంగ్రాముని ఈడుస్తారు)

సంగ్రాం— జహాఁపనా !

షాజ— చుప్ —

సంగ్రాం— నాసేవకు ఇదా బహుమానం ?

వంది— ఆవుజీ రాజాసాహెబ్ !

మాగ— చలోజీ గ్రాం సింగోజీ !

సంగ్రాం— అరరే ! అమవారాష్ట్రి అప్పడాల వ్యాపారం మానుకొని ఈ మహారాజుల సేవలోకి మలిపోయి దిగానుకదా !

(వందిమాగధులు సంగ్రాముని లాక్కుపోతారు)
(తెరలో, గుండుప్రేలినశబ్దం వినిపిస్తుంది)

షాజ— మామాజీ ! ఇక దుర్గప్రవేశము చేయుదముగాక. ముహబత్ ఖాన్జీ ! నావిజయానికీ, నా అభ్యుదయానికీ, నా జీవితానికి కూడా మీరే మార్గదర్శకులు. దుర్గప్రవేశంలో మొదటి అడుగు మీచేత పెట్టించి మీ యెడలనాకుగల భక్తిని కొంతైనా ప్రకటించుకొని తృప్తిపొందెదగాక. ఖాన్జీ ! ముందునడవండి !

అందరు— జయహో ! హింద్ కా సమ్రాట్ షాజహాన్ కీ జయ్ హో !

(నిష్క్రమణం)

# రంగం ఆరు

దర్బార్ మంటపంలోకి నూర్జహాన్ ప్రవేశిస్తుంది. వెఱ్ఱివేషం, వెఱ్ఱిచూపు, వెఱ్ఱినవ్వు, వెంట మోతీకూడా కనిపెట్టుకొనివుంది. నూర్జహాన్ ఒకబొమ్మను ఎత్తుకొనివుంది. ఆబొమ్మతన చంటిబిడ్డ లైలాఅనిఆమెఆశ. లైలాఎందుకో పోరుపెట్టి ఏడుస్తుందట! అందుచేత నూర్జహాన్‌కు ఆందోళన, విసుగు, అసహాయత్వంఅన్నీ ఏకకాలమందుకలిగి ఉన్నాయి! మోతీచేతిలోఒక పూల తొట్టివున్నది. అదిలైలా ఉయ్యాల!

నూర్జ—ఏడువకు! లైలా! ఏడువకే! ఇలాగిలా పోరుపెట్టి ఏడుస్తావ్ ఎందుకు!—లైలా! నాలైలా—నాముత్యం! నాపువ్వు!—ఏడవకమ్మా! ఏడవకు! అబ్బబ్బా!—ఏమేఁటిది? ఎంతఓదార్చినా ఊరుకోదు!—పోనీ! మీనాయనగారిని పిలిచేదా?-నాథా! నాథా! మనలైలా పిలుస్తున్నది!-రండినాథా!-ఎవరూపలకరేమి?—దాసీ! లైలా తండ్రిఎక్కడున్నాడో పిలుచుకురా. పిలువవే!-వారిపేరు మరిచిపోయావా రేమి?_మూర్ఖురాల!-(నవ్వుతూ) వారిపేరుషేర్‌ఖాన్—షేర్‌ఖాన్, పిలు.!-పిలు ఏమే!_ పలుకరేదా! రాలేదా!-అయ్యయ్యో!_బిడ్డా!-ఏడువకు! ఏడువకు! పోనీ! దాసీ! దాసీ! ఉయ్యాలయిటుతీసుకురా! జోలపాడిచూస్తా! ఆఁ-నెమ్మది నెమ్మది.- పువ్వులు రాలిపోకుండా! ఆఁ!_అది! (బొమ్మను తొట్టిలో పడుకోబెడుతూ) ఇకపడుకో! బిడ్డా! పడుకో! ఏడువకు! మీనాయనగారు వస్తారులే అమ్మా వస్తారు! బజ్జో! నాచిట్టి బజ్జో.! (అనివూపుతూ పాటపాడుతుంది.)

(అంటూవూపుతూ, పాడుతూ తానుకూడా నిద్రపోతుంది.)

(అపుడుఆసఫ్‌ఖాన్, మహబత్‌ఖాన్, వందిమాగధ్, సామంతదండనాథులు ఇతరపరివారం వెంటనడువ షాజహాన్ ప్రవేశం)

మహ—సమ్రాట్ షాజహాన్కీ జయ్‌హో!

అంతా—సమ్రాట్ షాజహాన్కీ జయ్‌హో!

షాజ—మహాబత్‌ఖాన్‌జీ! ఈ సమ్రాజ్ఞి ఇట్టిదీనావస్థయందుండగాచూచి, నా హృదయం ఉత్సాహానందములవంక పోవుటలేదు.

మహ—అదిసహజమే కాని — సమ్రాట్! రాజధర్మం బహుకఠోరమైనది.— విధిమొదట—విమర్శ అనంతరం. జహాఁపనా! ఇదిగో! ఇస్లాం పతాకం! ఇదిగో భారత కిరీటం! ఇక ఆలస్య మెందుకు?

అంతా—సమ్రాట్ షాజహాన్కీ జయ్‌హో!

నూర్జ—(ఉలికిపాటుతో లేస్తుంది.) క్యాహై ఏగడబిడ్? కౌన్‌హైతుమ్ లోగ్? క్యాం ఆయే? (అంటూలేచి అందరినీ పరీక్షచేస్తుంది. మహాబత్‌ఖాన్ చేతిలో

కిరీటం కనిపిస్తుంది.) ఏ క్యా హై కిరీట్? తుంకో క్యా సామిల్ గయా ఏక్ కిరీట్? కౌన్ హై తుం? — కహాఁ! — తుం రాజకుమార్ హో? — (మహాబత్ ను పరీక్ష చేస్తూ) రాజకుమార్! తుం! నహీ! నహీ! ఏ కిరీట్ తుమ్హారే నహీ హై లావ్ ఇధర్, లావ్ (అంటూ మహబత్ ఖాన్ చేతిలో కిరీటం తీసుకోబోతుంది. మహబత్ షాజహాను వంక చూస్తాడు. షాజహాన్ తలవూపుతాడు.) లావ్! (మహబత్ ఇస్తాడు. కిరీటాన్ని తదేక దృష్టితో పరీక్ష చేస్తుంటుంది.)

షాజ—సమ్రాజ్ఞీ!

నూర్జ—సమ్రాజ్ఞీ! కౌన్ హై సమ్రాజ్ఞీ!

షాజ—ఆప్!

నూర్జ—మై? హాఁ హాఁ — జరూర్! మై సమ్రాజ్ఞీహూఁ — సమ్రాజ్ఞీ అచ్ఛా—సమ్రాజ్ఞీసే తుంకో క్యా హోనా? - కహాఁ!

ఆసఫ్—బహెన్!

నూర్జ—బహెన్! తుంకౌన్ హై!— బహెన్! తుమ్ మేరా భాయీహూఁ! ఝూట్! బిల్ కుల్ ఝూట్! మేరా భాయీ ఏక్ చోర్ హై! — నమ్మక్ హరామ్ హై ఓ మర్ గయా! — జావ్!

మహా—సమ్రాజ్ఞీ!

నూర్జ—హాఁ హాఁ! మై సమ్రాజ్ఞీహూఁ! సమ్రాజ్ఞీ!

మహా—ఆజ్ షాజహాన్ కో కిరీట్ ధారణ్ హోనా!

నూర్జ—కిరీట్ ధారణ్ హోనా! అవశ్య! జరూర్! కహాఁహై షాజహాన్? షాజహాన్.

షాజ—మా!

నూర్జ—మేరే పాస్ ఆవ్!

షాజ—మా! (దగ్గరకు వస్తాడు.)

నూర్జ—తుమ్హారా నామ్ షాజహాన్!

షాజ—హాఁ మా!

నూర్జ—తుం సమ్రాట్ బన్ గయా? — అచ్ఛా! — తో ఆవ్ మేరేసాథ్

(అంటూ సింహాసనం వంకకు పోతుంది.)

షాజ—పాగలాపన్ మే భీ ఏక్ పంథా హై! (అంటూ నూర్జహాన్ వెంట సింహాసనందగ్గరకు వెళ్తాడు.)

నూర్జ-ఆవ్! బైఠోయహాఁ (అని సింహాసనం చూపిస్తుంది)

షాజ — (సింహాసనంమీద కూర్చుంటాడు)

నూర్ — దేఖో ! జహాన్-క్యా ? భూల్ గయీ-తుమ్హారానాం క్యాహై ? హాఁ-షాజహాన్ ! షాజహాన్. అచ్ఛా! షాజహాఁ! తుమ్హారీకిరీట్ ధారణ్ మేరీహాత్ సే హోనా తుంకో అంగీకార్ హై !

షాజ — హై మా.

నూర్ — తో శిర్ ఝుకో.

షాజ — (తలవంచును)

నూర్ — (కిరీటంనెత్తిమీదపెట్టి సంతోషంతో చప్పట్లుకొడుతూ) హా హాహా బోలో ! అబ్ బోలో ! సమ్రాట్ షాజహాఁకో జయ్‌హో !

అందరు — సమ్రాట్ షాజహాన్‌కీ జయ్‌హో !

షాజ — (సింహాసనమునుండి లేచి) అమ్మా ! నాకనులపండువుగా ఈ ప్రక్క ఆసనంలో మీరు అధివసించి, నాతండ్రిప్రేమించిన పవిత్రవస్తువును నన్ను భక్తితో పూజింపనిండు !

నూర్ — భూల్ గయీ. కహాఁహై మేరీలైలా ? కహాఁహై మేరీదాసీ ?

షాజ — ఇదిగో మీలైలా (అంటూతొట్టిబొమ్మతోసహా స్వయంగా పట్టుకవచ్చి నూర్జహానుకు అందిస్తాడు. ఆబొమ్మను ఒడిలో పెట్టుకొని నూర్జహాను ముద్దాడుతూవుండగా) అమ్మా ! మీకు మీలైలాకు ఇదే ఆర్వాసనం, ఇటు, ఇటు (అంటూ ఆమెను సింహాసనం ప్రక్కనున్న మరొకఆసనంమీద కూర్చోపెట్టి, ఆమె పాదాలను కనులకు అద్దుకుంటాడు. పిచ్చిసంతోషంతో నూర్జహాఁ నవ్వుతూ లైలానుచేతులలో ఊపుకుంటూవుంటుంది)

షాజ — (ఆవేశమయంగా) బోలో ! మొంగల్ రాజ బంధుకీ మాతా నూర్జహాఁకీ జయ్‌హో !

అందఱు — మాతా నూర్జహాన్‌కీ జయ్‌హో !

నూర్జహాన్ కూడా చప్పట్లుకొడుతుంది

మహా — సచివసామంత దండనాథులారా ! భారతహిందూ ముస్లింసోదరులారా! మహత్తరమైన ఈ చారిత్రక సమయమందు మహాత్మా అక్బరును సంస్మరించి, నానుడువబోవు విజ్ఞప్తిని దయతో ఆలకింతురుగాక.

పీ. పల్లకిరొక్కటే; పల్లకిలోనున్న
దేవతయొక్కటే — దేశమాత.
బోయీలు పుత్రులే; పుత్రులు నిర్వురే;
ఒకడు హిందువు, మరియొకడు ముస్లిం
ధీరహిందూభాయి! వీరముస్లింభాయి!
పల్లకి మోసెడిపద్ధతి విను!
ఒకమాట యొకపాట యొకప్రగతి యొకగతి
ఒకచూపు ఒకలక్ష్య మొక్కటే తెరువు
అదియె పద్ధతి-అదియె కల్యాణసిద్ధి
అన్న హైందవ! భాయీ మహమ్మదీయ!
కన్నులవి రెండు వేర్వేరయున్న నేమి?
కలిపిచూచెడి దృష్టి యొక్కటియె సుమ్మ!
అందరు — జయ్‌హో! హిందూముస్లింకీ జయ్‌హో! (కరతాళధ్వనులు)

(మంగళ గీతం)

— సమాప్తి —

లక్ష్మీపవర్ ప్రెస్, తెనాలి, కా. 1000—12—48

# నేటినటుడు వగైరా ★ ★ ★

[మూడు ఏకాంక నాటికలు]

రచయిత : కొప్పరపు సుబ్బారావు

వెల : ఒక రూపాయి    ది మోడరన్ పబ్లిషర్స్ (రిజిష్టర్డు) తెనాలి

— * అభిప్రాయాలు * —

" మీరు వ్రాసిన 'నేటినటుడు' ఉత్తమ నాటకరచనా విధానాన్ని సూచిస్తున్నది.' —టి. రాఘవ, బళ్ళారి.

" సుబ్బారావుగారి రచనలో—ఇచ్చిన సలహాల్లో—ఎంతో దూర దృష్టి, పరిణతా, ప్రతిభా కనబడుతున్నవి." —ఆంధ్రపత్రిక

" సుబ్బారావుగారి కలం, అనుభవంచేత ఇందులో సానదేరింది. ప్రదర్శింప బడినట్లయితే, ఈమూడునాటికలున్నూ సంఘానికి ఏదో రూపంలో కొరడాదెబ్బల వలె తగులక మానవు." —ప్రజామిత్ర

" సుబ్బారావుగారు తెలుగుదేశంలో ప్రజామోదంవడసిన నాటక రచయితల్లో సిద్ధహస్తుడు. ఆ నేర్పరితనమే ఈనాటకాలలోకూడ కొట్టవచ్చి నట్లు కనిపిస్తోంది." —ములుకోల

" This publication is of a high literary order. It is vigorous writing all through. The book is instructive as well as enjoyable"
—HINDU

" These playlets are very well written and do great credit to the author who is out to expose social evils through his writings."
—SADHANA

The first 'The Present day Actor' is an interesting instructive bold and bright satire. The second 'Confession' is in high classical style reminiscent of the ancient Gupta period. The third 'The Robinhoods' an Opera, is the most telling satire ever written in Telugu, on the fables of the present day on the economic inequilibrium of society."
—INDIAN EXPRESS